

# ప్రేమపారిజాతము

(అహింసాపరమోధర్మః





రచయిత

జిల్లెళ్ల వెంకటశివరావు

బిళ్లకుర్రు, రాజోలుతాలూకా, తూర్పుగోదావరిజిల్లా.

 [వెల 1—0—0.

# తొలిపలుకు

చదువరులారా!

నేను కవినిగాని భాషాకోవిదుఁడను గాని కాను. అందువలన నీ గ్రంథము విద్యాప్రభావమునుగాని భాషాపటుత్వమునుగాని ప్రదర్శించుటకుద్దేశించి వ్రాయఁబడినది కాదు. నాకుఁగల అల్ప ప్రపంచానుభవ సంస్కారజన్యమైన జ్ఞానదృష్టియందు వ్యసనాంధకార బంధురితమగు రెండువిషయములు గోచరించి నామనస్సును మిక్కిలి వేధింపదొడఁగినవి. అందొకటి ప్రాపంచికాభిలాషతో తమశక్తికొలంది మానవసేవయొనర్చుచు తమవలన నితరప్రాణులకు లేశంబేని హానికలిగింపక పరోపకారాశయముతో జీవింపనెంచు నిరపరాధులగు సాధుమూగ జీవజంతుమారణ విధానమును, రెండవది తోడిమానవులు వారి దేహబలమును దారవోసి స్వంతహస్తములతో భూమాతనారాధించి, పండించి నేత్రానందకరంబై ఆరోగ్యప్రదములగు కూరదినుసుల సన్నిటిని తమ తోడిమానవసంఘమునకు చేతులార గుడువనిచ్చుచు తాముమాత్రము అనారోగ్యము యువవ్యామాను జరామృతులుగల మాతాపితృ శుక్లశోణితోద్భవములు మేదోమజ్జాస్థి పురీష సముదాయ సంకులమగు జంతుకళేబరములను ఆహారపదార్థములలో మిళితమొనర్చి భక్షించుచుండుటయుజూడ నామనోవేదన మిక్కుటమయ్యెను. ప్రచారమువలన రాజ్యములుసహితము తారుమారగుట మనకందరకును ననుభవైకవేద్యమే! తగినప్రచారము చేసినచో సంఘముసగల

Kalaprapurna

**Sree Vikramadeo Varma D. Litt.**

Maharajah of Jeypore.

Fort Jeypore (Orissa)

14th April 1943.

---

Dear sir,

I thank you for the two copies of your 'PREMA-PARIJATAMU' sent by you.

It is regrettable that now-a-days many persons kill animals not only in the name of sacrifices and balis but for their own belly sake. I fully hope that persons who read your book will certainly be reluctant to commit such crimes.

Yours sincerely,
(Sd.) VIKRAMADEO VARMA,
Maharajah of Jeypore.

## తెలుగు అనువాదము.

మీరు పంపించిన రెండు ప్రేమపారిజాత పుస్తకములకును కృతజ్ఞత తెల్పుచున్నాను ఈకాలములో చాలమంది వ్యక్తులు యాగములు బలులునిమిత్తమేగాక స్వోదరపూరణ నిమిత్తమున్నూ జంతువులను వధించుట మిక్కిలి పశ్చాత్తాప విషయమై యున్నది. మీపుస్తకమును జదివిన వ్యక్తులు నిస్సందేహముగ నట్టిపాపకృత్యములను పరిత్యజించెదరని సంపూర్ణముగ విశ్వసించుచున్నాను.

(సం) శ్రీ విక్రమదేవ్ వర్మ,
మహారాజా ఆఫ్ జయపూర్.

# ఆంధ్రవ్యాసుని ఆశీర్వచనము.

భారతాది శతాధిక గ్రంథకర్తలును, స్వర్ణాభిషిక్తులును, కవిగండపెండేర విభూషణ భూషితులును, మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ, అభినవ శ్రీనాథ, ఆంధ్ర వ్యాసేత్యాది బిరుదాంకితులగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు.

మీరుపంపిన ప్రేమపారిజాతము అహింసా పరమోధర్మ యను తత్త్వార్థమును వెల్లడించు గ్రంథమును జదివి యానందించితిని. "నేను కవినిగాను, భాషాపరిజ్ఞానము లేనివాడనని మీస్వభావసౌశీల్యమును వెల్లడించుకొనిరిగాని మీగ్రంథము చూచినపై నట్టిభావము నామదినుండి తొలగిపోయినది. మీవలె అహింసాతత్త్వమును" సులభశైలిలో నిట్లు వ్రాయఁగల వారుండరని నాకు విశ్వాసము కల్గినది. మీ గ్రంథములో నుదహరించిన 27 విషయములును సర్వజనసుబోధకములగు చున్నవి. అందు కొన్ని కొన్ని విషయములు చక్కఁగ విమర్శించి వ్రాసియున్నారు. పూర్వయుగముల నెట్లున్నను కలిలో యజ్ఞములు చేయరాదనియే నాయభిప్రాయము. మీరు చాలా

విషయములు చర్చించి వ్రాయుట సమంజసముగా నున్నదని చెప్పుచున్నాను. "కూర్మావతారజంతువులు యథార్థములా?" అను విషయము మిక్కిలి చక్కగానున్నది. మరియు నిందుదహరించిన మకుటశ్లోకములు మకుటాలంకారములనియే చెప్పవచ్చును ఇట్టి గ్రంథమును వ్రాసి మీరు లోకమునకు పరమోపకారము చేసినవారైరని వ్రాయుట సత్యదూరము కాదు. భగవంతుఁడు మీకుఁ జిరాయురభ్యున్నతులు దయ చేయుగాక యని ప్రార్థించుచున్నాను.

21-5-1943, }
రాజమండ్రి. }

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

ఓం

శుభమస్తు.

ముద్రణభార నిర్వాహకులు

శ్రీ కోదండరామ పాదభక్తులు

# ద్వారంపూడి సుబ్బిరెడ్డిగారి జీవిత సంగ్రహము

మధుర హితాలాప లాలసులగు పసిబిడ్డల యాలాపంబులు తల్లికి ఆనందప్రమోదము లొసగవించునట్లును, పతిభక్తింగలిగిన కులాంగనలకు భర్తృదర్శనంబు ప్రియతమంబై ఆహ్లాద జనకంబగు విధంబునను, సాగరము ఇందోదయమున తరంగ పరంపరచే నుప్పొంగులాగునను, పద్మములు భాస్కరోదయమున వికసించు తెరంగునను, శూరులకు దీవ్రప్రహారంబయ్యు సమరంబుత్సాహ పూరితంబగు తీరునను పూజనీయమైన మాతృదేశమున సన్నిహితులైన సత్పాత్రులు లభించుట రసజ్ఞులగు రచయితల కానంద మొదవించును. తాము చరించెడి తావులందు కనులారగాంచి మనసార యానందించువిషయములే చిత్రవిచిత్ర రచనా సమర్థులగు లేఖరుల లేఖనియందు తాండవించుచుండును. స్వార్థత్యాగులు సౌజన్యనిధులు సమదర్శిత్వముగల మహనీయులు అహింసాతత్పరులు భక్తిజ్ఞానవిరాగులు . కల్పతరువురీతి నాశ్రితుల కుచితఫలమొసంగుచు పరోపకార పరాయణులగు కారుణికుల జీవిత

చరిత్రములను లోకమంగళముకొరకు చిత్రించుట వ్రాయసకాండ్రకు సహజధర్మము. మహత్తరమగు నయస్కాంతము, లోహసూచీగణముల నాకర్షించునట్లు మహనీయుల దివ్యతేజము మానవకోటిని దన వైపునకు లాగికొనును. కలిమాయాప్రకృతివశులై యసూయాభావమున మహాత్ముల ద్వేషించువారలు లోకబాంధవుని దివ్యప్రకాశమునుగాంచ యోర్వలేక ద్వేషించిన ఘూకంబుమాడ్కి నిందితులగుదురు. మకరందభరితమగు పుష్పగుచ్ఛమును భృంగము లాశ్రయించునట్లు మహనీయుల దివ్యచరితామృతమును గ్రోల సజ్జనబృందము లువ్విళ్లూరుచుందురు. సకల వేదసారమగు గీతాశాస్త్రము త్యాగమే మోక్షమునకుఁ దొలిసోపానమని నిరూపించుచున్నట్లు పెద్దలు వచింతురు. మానవులలోఁగొందరు దేశకల్యాణమునకై సర్వమును పరులకొరకు త్యజించి ధన్యులగుదురు. కొందరు కొంత త్యాగమునకును మరికొంత భోగమునకును వినియోగించెదరు. తక్కంగల ప్రాకృతులఁతము భోగమునకే యుపయోగించుకొందురు. ఇందు మొదటితరగతి యుత్తమోత్తముల యశము ఆచంద్రతారకమును, రెండవరకము మధ్యముల కీర్తికాలపరిమితికి లోబడియు, మూడవజాతిగౌరవము నామమాత్రావశిష్టముగను నగుచుండును. ఉత్తమోత్తముల జీవితవిధానము సర్వజనాకర్షణీయంబగుటయేగాక యాతం డాచరించు నద్దానినే లోకంబనువర్తించుఁ గావున దేశవిదితంబొనర్చుట మనీషి జన శ్రేయోదాయకంబగు

టచే నాకుంజూపట్టిన పుణ్యపురుషుల జీవితచరిత్రము నెరింగింపఁ కౌతుకంబందెడి చిత్తంబూరటం జెందుటకై కర్తవ్యంబు నిర్వర్తింప సంక్షిప్తోచిత పదజాలరచనతో నిక్షిప్తపరచి ధన్యతంగాంచెదనుగాక !

నన్నయ తిక్కనపోతనామాత్యాది కవిశేఖరులకుం బుట్టినిల్లై, త్యాగరాజాది భక్తశిఖామణులకు నిలయంబై, గౌతమీ కృష్ణవేణీతరంగపాళీ, తూగుటుయ్యాలలో నూగుచు, తన సహజరామణీయకమువలన నమేయానంద సంధాయిని యగు ఆంధ్రావనియందంతర్భాగంబై దనరి పవిత్ర గౌతమీ నీరపావనంబగు తూర్పుగోదావరిమండలమున కాకినాడ తాలూకు జెందిన గొల్లలమామిడాడ యను ప్రసిద్ధగ్రామమున సుప్రసిద్ధిం జెందిన భూమంచిరెడ్డి కులమునందు చెక్రపాల గోత్రోద్భవులగు ద్వారంపూడి సుబ్బయ్యగారను పుణ్య పురుషునివలన శాస్త్రవిధి నుద్వాహంబైన మహాలక్ష్మమ్మయను పతివ్రతారత్నమునకు చిరతర తపస్సంభృత భాగ్యోపేతులగు సుబ్బిరెడ్డి, రామిరెడ్డియను పుత్రద్వయంబు గలిగిరి. వీరిబాల్యముననే తండ్రి సుబ్బయ్యగారు పరమపదవి నలంకరించిరి. వంశపావనులగు జనక కుశధ్వజులంబోలె అనుజులిరువురును సహజ సోదరప్రేమ భాజనులై యైకమత్యమున మెలంగుచు నిఖిలజనమనోహరులై విలసిల్లుచుండిరి.

మన కథకులలో వయోజ్యేష్ఠులగు సుబ్బిరెడ్డిగారికి, ఆది రెడ్డి, రామకృష్ణారెడ్డి, రామచంద్రారెడ్డి, బిహారెడ్డిగారను

దశరథసుతులంబోలె గుణభూషణులగు నల్వురుత్తమ కుమారులు గలిగిరి. రామిరెడ్డిగారికి సంతతిలేనందున పై నల్వురిలోను మూడవవారగు రామచంద్రారెడ్డిగారిని దత్తత చేసికొనిరి. శ్రీరామసోదరులంబోలు నా నల్వురు పుత్రులకును ఆంధ్ర గీర్వాణభాషలమాత్రము నేర్పించి భగవద్గీతాది వేదాంత గ్రంథములను రామాయణ భారతభాగవతాది పురాణచరిత్రములను పఠించునట్లుజేసి చక్కని దైవభక్తి, భూతదయ, బ్రాహ్మణభక్తి పరమార్థజ్ఞానము కలుగునట్లు చేసియున్నారు.

దేవతాభక్తిసంపన్నులు ఆస్తిక్యశిరోమణులును నగు నా పుణ్యసోదరద్వయము క్రీ॥ శ॥ 1934 వ సం॥రమున వారి స్వగ్రామమున వేలకొలది సొంతద్రవ్యమును వెచ్చించి శ్రీ కోదండరామమందిర నిర్మాణంబొనర్చి ధూపదీప నైవేద్య కల్యాణ కైంకర్యములనిమిత్తము (ఎ 36-0) ముప్పదియారు యకరముల పంటభూమిని సమర్పించి అర్చకుల యావాసమునకై భవననిర్మాణం బొనర్చుటయేగాక ప్రతివత్సరమునను చైత్ర శు॥ నవమీ పుణ్యదివసమున మంచి ముత్తియముల తలంబ్రాలతోడను కర్పూరదివిటీలతోడను శ్రీ సీతారామ కల్యాణ మహోత్సవము నతివైభవముగ జరిగింపుచు జన్మపావనత గాంచుచున్న పుణ్యపురుషులు మన రెడ్డిసోదరులు. మఱియు రాజోలుతాలూకా ఊబలంకయను గ్రామమున క్రీ॥ శ॥ 1937 వ సం॥రమున నిర్మింపబడిన యాలయమున

పురజనుల కోరిక ననుసరించి సర్వమంగళా సమేత శ్రీమదుమా మహేశ్వరస్వామివారి ప్రతిష్ఠాపనోత్సవమునకై సుమారు 8 వేలరూప్యములు వ్యయపఱచి భూరిసంతర్పణములతో పండితసన్మానము లొనర్చి యతివైభవముగ ప్రతిష్ఠా మహోత్సవము జరిగించి తదుపరి వేలకొలది ద్రవ్యమును వ్యయపఱచి మంటపప్రాకారాదుల గట్టించి నిత్యపూజాపర్వోత్సవ మహోత్సవాది కైంకర్యములకై 15 పదిహేను యకరముల సుక్షేత్రములను దారవోసి ప్రతియేటను మహాశివరాత్రి పర్వదివసమున శ్రీ పార్వతీకల్యాణవైభవము నత్యంత శోభాయమానముగ జరిగించుచు వేనవేలు ప్రజలానందించునట్లు శంఖభేరీ మృదంగవాద్య విశేషములతోడను, బహుచిత్ర విచిత్రములగు బాణసంచా ధ్వనులతోడను, వందిమాగధ సూతగాయకుల గీతసంగీతములతోడను, చూపరుల కానందాశ్చర్యము లొదవించు నూరేగింపు టుత్సవముల జరిగించుచు తీర్థము నేర్పాటుగావించి తీర్థవాసుల కుచితభోజన వసతులం గల్పించి కీర్తిగాంచిన మహాభాగులు మన సుబ్బిరెడ్డి సోదరులు. మరియు రామకోటిజపములు శివరామ సప్తాహములు మొదలగు సత్క్రతువుల నన్నిటిని చేయించి పూర్ణాహుతి భారములవహించి భోజన సంతర్పణములతో భూతతృప్తి నొందించు నన్నప్రదాత లగుటయె గాక పెక్కురు ద్విజోత్తములకు గృహదానములను భూదానములను నొసంగి విప్రాశీర్వాదము లందుచున్న నిజగృహస్థులును మన సుబ్బిరెడ్డి సోదరవర్యులు. పుత్రికావివాహములకై యర్థించవచ్చిన పేద

పౌరులకు సర్వవ్యయముల భరించి పెండ్లిండ్లుచేయించిన కన్యా
దాతలకు సహాయపడిన పుణ్యపురుషులు మన రెడ్డి శ్రేష్ఠులు.
శ్రీ భీమఖండము, ఉమామహేశ్వర విలాసము, శ్రీ కోదండ
రామశతకము, శ్రీమహాపారిజాతము లాదిగాగల పవిత్రగ్రంథ
ముల నచ్చొత్తించి సహాయపడిన కవిజనకల్పతరువులు మన
రెడ్డి సత్తములు. మకరసంక్రమణ పుణ్యదివసమున ప్రతివత్స
రమునను బీదలకు వస్త్రదానములఁజేయు దీనజనబాంధవులు
రెడ్డిశేఖరులు. అవి, ఇవి యననేల మూర్తీభవించిన ధర్మ
స్వరూపులే సుబ్బిరెడ్డి రామిరెడ్డిగార్లనిన నతిశయోక్తిగా
నేరదు.

శాశ్వత ధర్మకార్యములకై సుమారు 8 లక్షలపైబడి
నిధిని వెచ్చించి లోకమంగళంబైన ధర్మములాచరించి తరించు
స్వాతస్సంజాత విజ్ఞానులగు శ్రీ రెడ్డిగార్ల యశస్త్యాగములు
తారాగణ పరివృతుండై వెలుంగు పూర్ణచంద్రుని యట్లు
జనసామాన్యంబున ప్రకాశించుచున్నవి. ఈ శుభచరితుల
ప్రత్యక్షదానముల గుర్తింపఁగలముగాని గుప్తదానముల నెట్లు
గ్రహింపఁగల్గుదుము. ఈ పావనచరితుల పుట్టుకపిదప సంపా
దించువారు ఖర్చుపరుపఁజాలరనియెడి లోకోక్తికల్లయైనది.
"దాతాదరిద్రః" యను కలినీతి యడుగంటినది. మనసుబ్బిరెడ్డి
సోదరులు పిత్రార్జితమున జీవించు దైన్యజీవులుకారు. కష్టించి
స్వార్జిత న్యాయసంపాదనచే భూధనముల సంపాదింపనేర్చిన
ధీశాలురు. పందలపాక నూలుమిల్లునందు భాగస్వాములు.

ఇట్లుండ క్రీ॥ శ॥ 1944 వ సం॥ర మకరసంక్రమణ పుణ్యదివసమున శ్రీనివాస దర్శనలాలస మానసులైన కనిష్ఠులగు శ్రీ రామిరెడ్డిగారు శ్రీరామదివ్య పదావాసమును క్రీ॥ శ॥ 1945 వ సం॥రమున వీరి నిజదేహకారిణియగు జనని మహాలక్ష్మమ్మగారు లక్ష్మీసాన్నిధ్యమునకును వేంచేయుటంజేసి వారి కుటుంబమునకును, ప్రాంతీయదేశమునకును తీరని లోటు సంభవించినది. వారియాత్మకు శాంతిచేకూర్ప జగద్వంద్యుఁడు వంద్యుఁడు.

శ్రీ రామిరెడ్డిగారి యనంతరము వీరి దత్తపుత్రులును శ్రీ సుబ్బిరెడ్డిగారి యౌరసులును నగు రామచంద్రారెడ్డిగారు వయసున బిన్నయయ్యు కావ్యపంచకము పఠించిన ప్రౌఢయగుటంజేసి సమస్తధర్మ సంపూర్ణంబైన వేదరహస్యంబులంగుర్తింప నేర్చిన గుణశాలియు తండ్రులకు తుల్యుండై బుద్ధి రూపౌదార్యశీల విద్యాసౌభాగ్యంబులు మెరయ జనక తండ్రిగారి ధర్మబాటయందు మార్గంబుదప్పక ననుసరింపుచుండ మన కథకులగు శ్రీ సుబ్బిరెడ్డిగారు క్రీ॥ శ॥ 1947 సం॥రమున లక్షరూప్యములవిలువ జేయు మూడుఅంతరవులతో నున్నతంబగు సౌధనిర్మాణంబొనర్చుకొని యట్టి ప్రాసాదసంప్రాప్యమునకు శ్రీ కోదండరామభద్రుని కరుణయే కారణమను దృఢనిశ్చయమున భక్తి పరాయణులగు శ్రీ రెడ్డిగారు పునరాలోచనా మగ్నమానసులై తమయావాసము ఘనంబై సర్వార్థ సంధాయకుండై తమయిలవేల్పగు శ్రీకోదండరామభద్రుని మందిరము తమ నివాసమునకంటె విలువ తక్కువగ నుండరాదను కృతనిశ్చయమున 12 వేల రూప్యములు వెచ్చించి

100 తులముల బంగరు మైపూతతో సూర్యకిరణ మరీచుల ప్రతి ఫలింపజేయు నేత్రముల మిరిమిట్లుగొలుపు సువర్ణప్రభా విలసితంబగు బంగరు (పసినికుండ) శిఖరమును, లక్షరూప్యముల ఖర్చుతో, ఆలయప్రాకార మంటపములను పునర్నిర్మిత మొనర్పదలంపడి "స్వాయంతరతి" వరాన్ తారయతియను ధర్మము ననుసరించి తాము తరించి లోకమును దరింపజేయుచున్న శ్రీ సుబ్బిరెడ్డియార్యుని అనన్య భక్త్యౌదార్య సుగుణ సంపద వర్ణనాతీతముగదా! మరియు శ్రీసుబ్బిరెడ్డిగారు మొదటినుండియు మాంసాహార నీచభుక్తముల వర్జించి అపార భూతదయాపరులై, కర్ణామృతంబై పరమ పావనంబగు శ్రీ రామనామస్మరణ వీనులసోకినంతనె యానంద భాష్పబిందు సందోహంబు, దందడింగ్రిందుకొన, డెందంబుగరగ, మేను గరుపార నిత్యముజన్మపావనతగాంచుచున్న భక్తశిఖామణులై దీపించుటయె గాక ననుదినంబును సాయం సమయంబు ననర్చకులచే వస్త్రోపవీతా భరణపత్ర కుసుమమాల్యచందన లేపనంబులం బ్రేమంబున నలంకృతులైన అర్చావతారులగు శ్రీ సీతా రామ లక్ష్మణ దివ్యసందర్శనమునకై పుత్రపౌత్ర బంధుహిత సమేతముగ నరుదెంచుచు రామకథాగాన కీర్తనంబులంబాడి, పౌరాణిక ప్రాకృతములైన నానావిధ స్తోత్రముల సద్దేవదేవుం బ్రస్తుతించి అంజలిబద్ధులై సాష్టాంగ నమస్కృతులొనర్చి గృహమునకు తరలుచుండుట నిత్యకృత్యముగ ననుసరించు మహాభక్తశిఖామణియునగు శ్రీ సుబ్బిరెడ్డిగారి మహాభక్తిమాత్రమున నాస్తికుండాస్తికుండగు. లోకి

శాలినియై, సుమంగలియై, పతియాజ్ఞానువర్తినియై, అర్థిదీనవనితాజనకల్పకంబై తులలేని యైశ్వర్యంబునం దుల దూగుచు నిరాడంబరియై, సద్గుణోపేతయగు అమ్మన్నగారను పేరంబరగు నిజధర్మపత్నితోడను, తనమాటకెదురాడక నిజజనకుండొనర్చు సత్కార్యసముదయంబుల కన్నిటన్సాసటగ నిలచి మఱి మఱి ప్రోత్సహించి భావికాలమున తండ్రినను సరించు మహోదాతలు కానగు స్వధర్మమును గుర్తెరుంగం జాలినసుపుత్రి చతుష్టయముతోడను, పితామహప్రీతులై బాల్యమునుండియు ధ్రువ వసిష్ఠాదుల ననుసరించు భక్తివినయ సంపన్నులగు పౌత్రవర్గముతోడను విరాజిలు శ్రీ రెడ్డిగారెంత యు ధన్యులు.

ధనమున కుబేరులును, దానమునబలియు, సంపదకు దుర్యోధనుండును, భక్తికి విదురుండును, నాఁ బరగు శ్రీరెడ్డిగారికి లభింపవలసిన దెద్దియు లేనందున జరాయువును, శ్రీరామ చంద్రప్రసన్న భాగ్యమును లభించుగాక! యని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాఁడను.

| | |
|---|---|
| విరోధి సం॥ర మార్గశిర శు ౧౧<br>బిళ్లకుర్రు<br>రాజోలు తా॥ తూ॥ గో॥ జిల్లా | ఇట్లు,<br>సర్వజన విధేయుఁడు.<br>జిల్లెళ్ల వెంకటశివరావు |

# విషయసూచిక.


1. జీవహింస-దోషారిష్టము ... 2

2. అహింసామహిమ ... 8

3. మానవులు మాంసభక్షకులా? ... 19

4. మాంసాహారము-అపవిత్రము. అసహ్యము-
అనారోగ్యము ... 24

5. జంతుసృష్టి మానవభోజ్యమునకుగాదు ... 27

6. జంతుహింస-కృతఘ్నత ... 32

7. జంతువులను పెంచి వధించుట పుత్రఘాతవంటిది 38

8. జాతరులలో పసురపూజలు నింద్యార్హములు ... 46

9. జూదములు-జంతుపందెములు ... 53

10. యజ్ఞములు ... 55

11. ప్రేమతత్వమహిమ ... 59

12. మానవులు నియమబద్ధులేల కావలయును? ... 60

13. మాంసభక్షకులగు విదేశీయుల తెలివియెట్టిది? 62

14. హింసప్రకృతి స్వభావమైనను మనమేలహింసింపరాదు? 64

15. దేహబలమునకు మాంసాహార మావసరమా? 65

16. అండముల భుజించుట హింసయేనా? ... 68

17. మాంసాహారము రుచియా? ... 69

18. ఆహారభేదములు గుణత్రయవివరణము ... 71

(అ) సత్వగుణము ... 71

(క) రజోగుణము ... 73

(గ) తమోగుణము ... 75

19. క్రయమాంసభక్షణ ముచితమా ? ... 79

20. క్రూరజంతువులు వధార్హములా ? ... 81

21. వివిధహింసలు ... 83

22. జంగమస్థావర భేద వివరణము ... 84

23. అహింసోద్ధరణ-పాత్రనిర్ణయము ... 89

24. ఆత్మఘాతకు లెవరు ? ... 93

25. హింసాపాపములు ... 94

26. తుదిపలుకు ... 96

27. ఫలశ్రుతి ... 103

ఓం!

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# ప్రేమపారిజాతము.



క. శ్రీ విలసిత ధరణీతన
యా వదనసరోజవాసరాధిప సితరా
జీవదళనయన నిఖిల ధ
రావరనుత సుగుణధామ రాఘవరామా. (భాగవతము)

శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
—భగ. అ 4 శ్లో 7.

తా॥ ఓ అర్జునా! ఎప్పు డెప్పుడు వర్ణాశ్రమధర్మములకు కీడు గలుగుచున్నదో, అధర్మమునకు వృద్ధి గలుగుచున్నదో అప్పు డప్పుడు నేను మాయవలన జన్మము లెత్తుచున్నాను.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్!
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.
—భగ అ 4. శ్లో 8.

తా॥ సన్మార్గవర్తనుల రక్షించునిమిత్తమును, దుర్మార్గవర్తనుల నాశనము జేయుటకును, ధర్మము ప్రతిష్ఠించుటకును ప్రతియుగమునందును నే నవతరించుచున్నాను.

# జీవహింస — దేశారిష్టము.



ఏదేశమునకు సంబంధించినను, ఏమతమునకు జెందినను మానవజన్మ మెత్తిన ప్రతివ్యక్తియు, సత్యము, దానము, అహింస అను మూడు నియమముల పాలించుటవిధియైయున్నది. ఏలనన సత్యమువలనపరస్పరము ఒకరినొకరుమోసగించి జీవింపకుండుటయు, ధర్మమువలన పరస్పరసహాయము లొనర్చుకొని, పరుల కష్టసుఖములు తమవిగ భావించెడి పవిత్రజ్ఞానము పొందుటకును, అహింసవలనప్రపంచమునందుకలిసకలజీవులును వాటివాటి కర్మల ననుభవించుటకై పరమేశ్వరునిచే సృజింపబడి ఐహికసుఖదుఃఖముల ననుభవింపవలసియుండుటయేగాక, తమవలనే సమస్తజీవులును పరమేశ్వరచైతన్యమునుండియే యుత్పన్నమైన వనెడి పరమార్థజ్ఞానము నొంది ఒకరినొకరు హింసించుకొనక సుఖజీవనముల గడవుటకును, నిర్ణయింపబడినందున అట్టిధర్మములు ఐహికజీవితానందమగుటయేగాక పరమార్థమునకు రాజబాటలని గూడ గ్రహింపవలసియున్నవి. అట్టి విషయములు పుణ్యపురుషులగు ఉత్తమసంస్కారులకు మాత్రము గోచరమగును గాని పశుతుల్యులగు సంస్కారరహితులకు గోచరముగాదు. అందునను పైమూడు ధర్మములలోను ఒకదానికంటె నొకటి అవశ్యాచరణీయములైయున్నవి.

అట్లుండ: ఇప్పటి కాలములో అహంకారజీవులసంఖ్య అభివృద్ధియై అన్నిజాతులయందును ఆబాల వృద్ధులు సహితము ధర్మవిరోధులై, శాస్త్రద్రోహము, మతవ్యతిరేకము నగు మానవహృదయ దయాశూన్యమైన ఘోరహింసలకు గడంగి కఠినపాషండహృదయులు బెచ్చుపెరగి ధర్మసూత్రార్థముల గ్రహింపజాలక గోహింసాదికలుషకృత్యము లొనర్చుటకు సహితము వెనుదీయని అవివేకులై దేశమును అధోగతిపాలొనర్చి మతపవిత్రతను మంటగలపి వ్యర్థజీవనులై పాడొందుచున్న యీ దుర్దినములలో తగిన ప్రచారమొనర్చి ప్రజలను ధర్మమార్గమున ప్రవర్తిల్లునట్లు జేయకుండుట దేశద్రోహమును, మతద్రోహమును గాక మరేమి? అట్టితరి యీ పవిత్రభారతదేశపుత్రులగు మానవసోదరులారా! మన మొనర్చు క్రూరహింసల నొకసారి దలంచిజూడుడు! మనతో సమానమగు అవయవనిర్మాణములు గలిగి ఆహార, నిద్రా, భయ మైధునక్రియలలో మనవలెనె ప్రవర్తిల్లుచు రక్తమాంసశల్యాదినిర్మాణములలోనే గాక, ఆజ్ఞలనుసహితము గుర్తించి ప్రవర్తింపగలుగుటయు, పుత్రప్రేమాది మానవానుకరణములగు అనురాగాదులు గలిగి, మనోవాక్కర్మలచే మానవసంఘమునకు ఎట్టి అపాయములను గాని గలిగింపక యీడుమిక్కిలి మన కన్నివిధముల జీవితానందముల సమకూర్పసహాయపడు– నోరులేనిజీవులు– దుష్టస్వభావశూన్యమైన జంతువులు– తమ కండకావరముల సుక్షేత్రముల ధారవోసి బహు

జనోపయోగమునకై పాటుపడు త్యాగమూర్తులు-పరమమల
మాత్రములచే చవిటినేలల సుక్షేత్రములుగ మార్పజాలు
ప్రకృతిశాస్త్రతత్త్వవేత్తలు- దినచర్యలలో రైతుజనుల మను
గడలు గడపు పరమమూర్తులు-నిష్కల్మషచిత్తులు-ధర్మదేవతా
స్వరూపులునైన జంతుసమూహములు వధ్యాశాలలందు ఊరి
కంబములకు గట్టబడి భీకరకృపాణహస్తులై లయకారులవలె
జూపట్టు కటికవారలచే నరుకబడుసమయమున దీనదృష్టులతో
బిక్కమొగములు వైచి, మూకీభావము జెంది, పంచప్రాణ
ములను బిగబట్టి అల్లకల్లోలములగు మనస్తరంగములు జెల్లా
చెదరుకాగా ఆర్తస్వరమున నారంభించి ప్రళయకాలమేఘగర్జ
నంబుపగిది, 'అంబా', యని యరచి నొక్క వేటునకు దెగి,
వాటిదేహములనుండి శిరముల వేరుజేసి వాని జీవితముల
భూలోకమునుండి విరమింపజేసినప్పుడుగాని దేహములనుండి
రక్తము వెల్లువలై ప్రవహించునప్పుడుగాని వానియార్తారవములు
శబ్దబ్రహ్మమున లీనమగునపుడుగానిపరిసరప్రదేశస్థులగు క్రూర
హృదయులు సహితము ద్రవీభూతులై, ప్రేమతరంగముల
ప్రవహింపజేయుటకు మారు, అట్టి పరోపకారపరాయణులగు
చతుష్పాజ్జంతువుల కొనర్పవలసిన పరోపకారము- చూప
వలసిన కృతజ్ఞత- ఒలికించవలసిన దయారసము- ప్రసరింపవల
సిన కనికరదృష్టులు- నెలకొల్పవలసిన మైత్రికి బదులు వధ్యా
శాలలందుఘాతుకులమధ్యహింసాపూర్వకబలవన్మరణవ్యాపా

క్రూరయాతనలచే బాధపడ సేయుచు మున్ముందుమునకు రానున్న ఐహికపరమార్థ కష్టనష్టముల గ్రహింపజాలని క్రూరజనులు పెచ్చుపెరగి దేశసంపదనాశన మొందించు పశునాశకులు విస్తరించుట మానవసంఘనిర్మూలనపాపహేతుకము గాక మరేమి?

అద్వైతసిద్ధాంతముల పాశ్చాత్యదేశముల కాశ్చర్యమును గలిగించి అహింసాతత్త్వమును ఖండఖండాంతరముల జాటించి జయభేరి మ్రోగించిన భారతదేశదివ్యప్రతిష్ఠను గాపాడుడు. అట్టి త్వరపడి గావింపలేని దేశము ప్రేమశూన్యమై దైవప్రీతికి దూరము కాగలదు. జంతుహింస సామాన్యపాపము కాదు. మానవుడు గ్రహింపగలిగినంతలో జీవహింసకు మించిన పాపము మరెద్దియు లేదు. అవకాశమున్నంతలో మనవలెనే భౌతికశరీరముల దాల్చి, పుత్రమిత్రకళత్రాదులతో నానందముల ననుభవించుచు, సాంఘికమతాచారముల నాచరించుకొనుచు, వాటివాటి శక్తిసామర్థ్యముల ననుసరించి, అన్యోన్యప్రేమాలాపముల ప్రొద్దుపుచ్చుచు, సుఖముగ విహరించు తిర్యగ్జంతువులయందు నిష్కారణవైరము పూని స్వకుక్షింభరనిమిత్తమై దెగటార్చి వానిమాంసముచే ఏమానవులు తమ మాంసకండరముల బెంచసెంచెదరో, అట్టిమానవులకా యమాయక మూగజీవుల నేత్రధారలు మహావిపత్సముద్రమై-వాటి దుఃఖారావములు విచారతరంగములై- వాటి నాసికారంధ్రములనుండి బయలువెడలు అంత్యశ్వాసలు ప్రళయకాలఝంఝూ

మూరుతములై- వాని రోదన ధ్వనులు భయంకరశాపాక్షర ములై- అపారభీతితో వాయువుల కుంభించుతరి గలుగు నయ్యా మాయకకులభకశక్తి ప్రళయకాల భీకరస్వరూపమై దేశమును భస్మీపటలమొనర్చి అధోగతిపాల్జేసి నాశనమొందింపగలదు.

అవి నోరులేని పశువులే! చతుష్పాదములే! మనకుగల బుద్ధిసభ్యతలు వానియందు దక్కువైనను అవిమనబిడ్డలకు ఎట్టి అమృతోపమైన క్షీరములనొసంగి బోషింపుచున్నవో జూడుడు! మనము పెరిగి పెద్దవారమైనపిదప పాడిపంటల నొసంగి మన జీవనాధారమున కెట్లుపయోగపడుచున్నవో గ్రహింపక విశ్వాస శూన్యకృతఘ్నతాదోష మహాపాపుల మైన మనకు న్యాయరక్షకుండగు పరమేశ్వరుడు సుఖజీవన ములనొసంగి వృద్ధిబొందింపగలడనుమాట సర్వకల్ల. ఓసుజను లారా! సింహావలోకనము జేసి న్యాయదృష్టిని బరికించి జూడుడు. ఎంత సిరిసంపదలతో దులతూగుచున్నను, ఎన్ని వాణిజ్యశాలలతో అలరారుచున్నను, ఎంతవిద్యాబుద్ధులతో బెంపొందుచున్నను, ఎందరెందరి పరిశోధకులచే విరాజిల్లు చున్నను, ఎన్నెన్ని నాగరకతాచారములచే యభివృద్ధిగాంచు చున్నను, ప్రేమ తత్వశూన్యులై ఆహారము నిమిత్తము రాక్ష సకృత్యము లొనర్చి మాంససంపాదన కొరకు జీవజంతువుల వధించి పశుహత్యల జేయుచుండుటచేతనే వాటిదుఃఖారావ శాపగంభీర విచారాలాపజనిత మహాపాపకర్మయే ప్రళయ కాలరౌద్రావతారమున జెలరేగి విదేశములన్నియు అన్యోన్య

వైరవర్తనులై సంగ్రామరంగంబు లొనర్చుకొనుచు ప్రజా నాశన మొందింపుచుండుటను గమనించుచుండరుగాక!

ఏ హస్తములతో లోకమునంతయు భస్మమొనర్ప సమకట్టెనో ఆహస్తములే తననెత్తిపై నెక్కి భస్మమొందిన భస్మాసురునిగతి విచారించి చూడుడు! ఎన్నియుగముల బట్టి లించినను భగవానుడు హంతకచర్యలొనర్చు మృక్కడి రక్కసుల నాశనంబొందించుటయు, ప్రేమస్వరూపులగు దేవతలకాపాడుటయు ఆదర్శముగ గన్పట్టుచున్నది. భగవంతుడు ప్రేమప్రియుడు- కరుణాస్వరూపుడు- ప్రాణప్రదాత- ముక్తి ప్రసాదకుడు గావున తద్వ్యతిరేకమైన హింసాక్రోధముల నాశన మొందింపకమానడు. కావున మానవ సోదరులారా! త్వరలో లెండు! మేల్గాంచుడు! పత్రికల నెలకొల్పుడు! ప్రచారకులకు సహాయపడుడు! కారుణ్యసంఘముల నిర్మింపుడు పుస్తకముల వ్రాయుంపుడు, పాటలతో ప్రేమగీతముల బాడింపుడు, నేటివరకు హిందూదేశము యుద్ధదావానలమున బడి నశింపకుండుటకు కారణము అహింసాపరమోధర్మః యను సకలధర్మసమన్వయమగు ప్రేమోపాసకులగు ప్రాచీన ఋషిపుంగవుల పాదరజము నిలయమై ప్రకాశింపుచుండుటయే ముఖ్యకారణమనిగ్రహింపుడు! యీ సదుద్యమప్రోత్సాహము పరకాలనియమముతో బనిలేదు.

శ్లో. 'నిత్యం సన్నిహితోమృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః' అను యథార్థవచనము ననుసరించి మృత్యుదేవత యెల్లవేళల మనల వెన్నంటియుండుటంజేసి వెంటనే ధర్మమార్గము నవలం

భించి ప్రతిష్ఠించుటయేయను తపములను. దేశముల్లకల్లోలము వలదుండుటచే, మున్ముందీయుద్యమము కొనసాగింపవచ్చునని, కాలహరణ మొనర్పవీలులేదు. నెరవేర్పగల్గితిమా! ధన్యులము. నెరవేరకయున్నచో దేశకల్లోలమున అంతమొందెదమా? మన పవిత్రోద్దేశ్యమువల్ల అత్యుత్కృష్టమైనం దువపరమపదవి లభించియే తీరును. కావున ఎట్లైనను యోగ్యభగింపనిభంగి ధన్యులమే యగుదుము. కావున దేశీయులెల్లరును శ్రద్ధవహించి ప్రతిగ్రామమునందును జీవకారుణ్యసంఘముల స్థాపించి అహింసాతత్వమును స్వాంతవచనములతో జనులకు బోధించి కలకట్టుబాట్ల నొనర్చి దేశమున ప్రేమదేవత తాండవమాడునట్లు విజ్ఞానులగు మానవులందరును కృషిసేయొనర్చి తరించెదరుగాక! ఈపవిత్రోద్యమము అభివృద్ధినొందిన అన్నిమతములవారును పాటుపడుట ముఖ్యధర్మమైయున్నది. అన్నికులములవారును శ్రద్ధతో కృషియొనర్చి ఈద్యమవృద్ధికిసహాయపడునట్లు భగవానుడనుగ్రహించుగాక!

## అహింసా మహిమ.

శ్లో॥ సర్వేయజ్ఞేషు యద్దానం । సర్వతీర్థేషు యత్ఫలం
సర్వదానఫలంవాపి । తన్నతుల్యా మహింసయా.

తా॥ అశ్వమేధపౌండరీకాదిమహాయజ్ఞముల యొక్కయు, గంగాస్నానాది తీర్థస్నానముల యొక్కయు గోదానాదిషోడశదాన

ములయొక్కయు మహత్తరములైన పుణ్యములన్నియు అహిం
సయొక్క నూరుకోట్ల ఫలితములో ఒకభాగమునకు సరిరావు.

శ్లో. అహింసా పరమోధర్మః ! అహింసా పరమం తపః
అహింసా పరమందానం ! ఇత్యూచు ర్మునయ స్తథా.

తా॥ అహింసకుమించిన ధర్మముగాని తపముగాని, దానముగాని, లేదని ఋషులు వచించిరి.

ఆ. దంతియడుగులోన దక్కినజంతు చ
యంబునడుగులెల్ల నడగియుండు
నట్లు ధర్మకోటులన్నియు లోనగు
నర్థగుణ యహింస కింతనిజము. (మహాభారతము.)

తా॥ ఏనుగుపాదములో తక్కినజంతువుల పాదములన్నియు యిమిడియుండునట్లు అహింసకు తక్కిన ధర్మకోటులన్నియు తక్కువయై యున్నవి.

"అహింసాపరమోధర్మః" అను శాస్త్రోక్తినిబట్టి అహింసావ్రతము అన్నిధర్మములకంటెను అగ్రస్థానము వహించియున్నది. వలనన యజ్ఞయాగాదిక్రతువులును, గోదానాదిమహాదానములును, గంగాస్నానాదిపుణ్యతీర్థసందర్శనములును, అన్నదానాది మహత్తరదానములును మానవుల చిత్తసంస్కారము కొరకుఏర్పరుపబడినవి. చిత్తసంస్కారమనగా ? సృష్ట్యాదినుండి దారు పాషాణాదిజన్మల లగాయతు మానవులగు పర్యంతరము దాటివచ్చిన కోట్లానుకోట్ల జన్మలయందు చిత్తములకు వివి

ల్పము గలిగించెడి 'దేహమేదా'మని పరిభ్రమించు భ్రాంతినివిడచి
'ఆత్మైవ త్సర్వభూతాని' యనువిజ్ఞానమును బొంది ఏచైతన్యము
నుండి దా మావిర్భవించిరో తిరిగి అట్టిదివ్యచైతన్యమునందు లీన
మగుటకు ప్రయత్నించుటకై పూనుకొనునట్లు జేయు పవిత్రోద్దే
శ్యమునకే చిత్తసంస్కారమని పేరు. అట్టిచిత్తసంస్కారమునకు
యింద్రియముల జయించుటయే ప్రథమ సోపానము. ఇంద్రియ
ములజయించుటకు ఆహారనియమము అత్యావసరము ఏలననగా,
ఒకానొకడు మద్యమాంసములను భుజించి, వెల్లుల్లికారము
మొదలగునవి దిని ఆ రోజంతయు దన శరీరస్థితిని బరిశీలించి
జూచికొనినచో వేడి, పైత్యము అధికమై, మనోనిబ్బరత జెం
దక యింద్రియములు చలించి స్వాధీనముదప్పి అనేకదురాలోచ
నలు బయల్వెడలి, కోరికలధికమై వాటిని దీర్చికొన అలభ్యము
లగుటచే తనలో దాను విసుగుజెంది క్రోధమతిశయించి బలు
కరించువారిపై గసరికొనుచు తప్పువివాదములకు సహితము
గడంగి దారాపుత్రాదులను దల్లిదండ్రిలను సహితము హిం
సించుటకు వెనుదీయనంతటి అవివేకమునకు బాల్పడుచుండు
టను మనమందరమును తరచు గుర్తించుచునే యున్నారము
అట్లుగాక సాత్వికపదార్థములగు పాలు, పండ్లు మొదలగున
వియు, కారము, ఉప్పు, పులుసు స్వల్పముగవైచి పక్వపరచిన
ఆహారములను మితముగ భుజించెడివారి యింద్రియములు అంత

రము జేయవలయునవెడి దురహంకారమును బొందక మనోనిర్మలత్వముచే దేహారోగ్యాదులు సాఫల్యతజెంది సుఖానంద జీవితమును గడుపగలుగుటనుగూడ అనుభవమునై గ్రహించుచు నేయున్నారము. కావున యింద్రియముల వేగిరపాటు నడంచుటకును, బుద్ధిని స్వాధీనమునం దుంచుటకును సాత్వికాహారముల స్వీకరించుట ముఖ్యావసరము. మాంసాహారము హింసవలనగాని లభించదు. అదియునుంగాక, అన్యాయముగ పరజీవుల ప్రాణములను బలవంతముగదీయవలసి వచ్చుచున్నది. అందువలన పాపాహారమై యున్నది. పరజీవుల ప్రాణములదీయ సమకట్టి కల్మషాహారముల భుజింప సాహసించు కఠినచిత్తులకు యింద్రియజయముగాని చిత్తసంస్కారముగాని లభించుట దుర్లభము.

ఇంద్రియజయము లేని నరులు క్రూరస్వభావులై హత్యాలసైతమొనర్ప వెనుదీయరు. విద్యావినయసంపన్నతలు లేక అవివేకులై తాముజెడి దోడిమానవలోకమునకుగూడ హాని గలిగింతురు. కావున అహింసావ్రతమును అట్టిదీనులగు నరులకు బోధించి హింసాకృత్యముల మాన్పించి అనేకకోట్ల నిరపరాధ తిర్యగ్జంతువుల రక్షించిన మహాపుణ్యమును, తామసాహారములగు మత్స్యమాంసభక్షణలచే అపవిత్రులై అవివేకులై, విద్యాహీనులై, జ్ఞానశూన్యులై మోటుబారియుండెడి దీనజనులకు జీవకారుణ్యము గలిగించి సుజ్ఞానులై తరించుటకు మార్గమును

జూపిన మహత్తరపుణ్యమును యీఅహింసాయుద్యమ పురోవృద్ధికి సహాయపడినవారలుబొందగలరు. దేశమునహింసప్రబలియున్నంతకాలము ప్రజలు ధర్మనీతివర్తనులగుట కల్ల. ఏనాడుదేశమున పశుమారణోపద్రవమైన హింసమాని అహింసాధర్మమనుష్ఠింపబడునో! ఆనాడు పశుసంతతి అభివృద్ధియై సారహీనమైన ఊసరక్షేత్రములతో నిండియుండిన భూమాత సారవంతము కాగలదు. అంతట సర్వసస్యసమృద్ధిగలిగి జనులు ఆహారపదార్థముల సమృద్ధిగ బడయగలరు. ఆహారసమృద్ధివలన ప్రజలు చోరత్వాదినీచకృత్యముల జొల్పడక పవిత్రజీవనులు కాగలరు ప్రేమతత్త్వోపాసనచే జనులు ఏదేశమున హింసాదినీచకృత్యము లొనర్పకుందురో; హింసాదినీచనడువడుల ననుసరింపక ధర్మమార్గప్రవర్తకులై భూదేవిని మాతృప్రేమతో అమ్మాయని బిలువనేర్తురో ఆదేశమాతకు తన ప్రజలయందు పుత్రవాత్సల్యత జనించి తల్లికి పుత్రప్రేమ వాత్సల్యత జనించి వంతన స్తన్యములు ఉబికి పాలు చేపునటు వత్సమునట్లు భూమాత కూడ సస్యవంతయై ప్రజలకు తినుటకు తిండియు, కట్టుటకు బట్టయు కొఱతలేనంత నిలువగలిగియుండును. అట్లుగాక ప్రజలు ధర్మహీనులై హింసాదికలుషకృత్యములతో అన్యోన్యకలహప్రియులై అజ్ఞానులై పశుసంపదను నాశనబరచి భూమాతను ప్రేమదృష్టితో వీక్షింపక ఏదేశమునజనులు కఠినచిత్తులై పశుమారణాది హింసాకృత్యములు లొనర్చి క్రోధమాత్సర్య

ములు వహించి మెలంగకరో అట్టి దేశమాతకు ప్రజల యందు పుత్రప్రేమవాత్సల్యత దొలగి సారహీనురాలై గొడ్డుపోయి పాడిపంటల నొసంగజాలక కరవు కాటకములకును, జారచోరత్వములకును, రోగహింసాదిదేశోపద్రవములకును, రాజదండనలు మొదలగు సర్వారిష్టములకును బుట్టినిల్లగుటయేగాక మానవు లన్యోన్యకలహములొంది అన్నవస్త్రహీనులై పరితపించెదరు. కావున అన్నిధర్మములును ఈ అహింసాధర్మము నందంతర్భూతమై యున్నవి. కాబట్టి భూతదయనుగూర్చి ప్రజలలో ప్రచారము జేయుట యనగా దేశసంపదను అభివృద్ధిపరచుకొనుట యగుటంజేసి మహత్తర పుణ్యకార్యమై యున్నది. కావున నేయుద్యమము దేశమున గల అమాయక మూగజీవులు అకాలమరణము నొందకుండ నట్లొనర్చి నిర్భయముగ జీవింప సహాయపడునో? ఏ సదుద్యమము పరమోత్కర్ష స్థితికి కారణభూతమగు భగవదపచార మహాపాతకకార్యమని ప్రజలతో నెలుగెత్తి చాటుచేయునో? ఏ పవిత్రోద్యమము హింసాకృత్యము జీవహింసామహాపాపమనియు, మలమూత్రభాండ కాయసాధక శవభక్షణము నీచాతినీచకృత్యమనియు మానవోపయోగి జంతుసంహారణము కృతఘ్నతామహాపాపభీకరరౌరవాదినరక సంప్రాప్తకారణమనియు మద్యమాంసాదినీచాహారస్వీకరణము మానవుల విజ్ఞానసంపదను నాశనమొనరచి బుద్ధిని మాటుజేసి యుక్తాయుక్త వివేకజ్ఞాన

శూన్యులగు నట్లొనర్చి అవిద్యావంతులుగ తయారుజేసి పాషా ణాది జడస్వరూప నీచజన్మల కొల్పడజేయునని దేశము యొక్క నలుదిశలయందును ఎలుగెత్తి జాటనేర్చునో అట్టి సర్వధర్మసమన్వయమగు యీ అహింసాప్రచారోద్యమమును ప్రోత్సహించుటకంటె మానవులొనర్పగల సత్కార్యములు మరేవి గలవు! కవి గాయకులు గాని, పౌరాణికులుగాని, శాస్త్రవాదకులుగాని, వేదవిదులుగాని తార్కికులుగాని వే యేల సకలవిద్యల నెరింగిన పండితోత్తములుగాని యింత కన్నను మించిన పరమార్థమును ప్రజలకు జూపింపజాలరు. ఏలనన చతుర్వేదములును, షట్శాస్త్రములును, అష్టోత్తర శతోపనిషత్తులును, అష్టాదశపురాణములును మన్వాదిస్మృతు లును బరిశీలించిన శ్రీ వేదవ్యాసమహామునుల వారి యీ నిశ్చి తాభిప్రాయము స్పష్టమగుచున్నది. "శ్లో॥ వేదశాస్త్ర పురా ణేషు వ్యాసస్య వచనద్వయం । పరోపకారః పుణ్యాయ । పాపాయ పరపీడనం॥" అనగా ఒరులకు సహాయపడుటయే సద్గతికిమార్గము. ఇతరజీవులను పీడించుటయే దుర్గతికి కారణ ము. ఈ రెండు ధర్మములే శాస్త్రసారమని వారు తెలవిచ్చి యున్నారు.

ఆదియునుంగాక హిందూమతమునందు అవశ్యాచరణీ యముగ నొనర్పవలసిన నిత్యకర్మలయందు సహితము మరువ కుండుటకై స్వస్తివాక్యములతో "గోబ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం" అనెడి పవిత్రవాక్యమును నిత్యమును బఠించు

నట్లు వీర్పరచియున్నారు. అనగా చతుష్పాదజంతువులలో సాత్వికబుద్ధిగలిగినగోవులున్ను, మానవజాతిలో సాధుస్వరూపులగు బ్రాహ్మణాదులున్ను పేర్కొనబడి యుండుటచే అట్టిఅన్వయము సమస్తసాధుజంతువులకును సాధుపుంగవులగు సమస్తమానవజాతికిని వర్తించునుగాని జాతిపరము కాదు. కాబట్టి దేశకల్యాణమునకు దోహదమిచ్చు సాధుజంతు హింసాకృత్యము వలదని బోధించు యీ అహింసాపవిత్రోద్యమమునకు సహాయపడక ఏ యితర ధర్మకార్యము లొనర్చినను అవన్నియు జవిటినేలం జాతిన విత్తనములరీతిని, బూడిదంబోయు పన్నీరుచందమునను నిష్ప్రయోజనములని గుర్తించుదురుగాక.

కావున భారతదేశ రాజాధిరాజులారా! జమీందారీ పరిపాలకులారా! భూస్వాములారా! వర్తకశిఖామణులారా! ఉద్యోగ అనుద్యోగీయులారా! సారస్వతాభివృద్ధియనియు, భాషాపోషణోద్యమమనియు దలంచి రాజపోషక- పోషక-జందాదారులై మీమీ పవిత్రధనసహాయముల నొసంగి ప్రపంచోద్ధరణదీక్షాబద్ధకంకణులై ఏ పుస్తకములయందు తమ నామధేయముల బ్రకటింపజేసి ఐహికగౌరవానందముల ననుభవింప దలంచితిరో అట్టి సత్కార్యములకంటె యీ అహింసా ఉద్యమప్రచారకార్యనిర్వాహణదీక్షను ప్రజలలో ప్రబోధించు పవిత్రపుస్తకముల ప్రకటింప సహాయపడుట ఎంతమాత్రమును దీసి పోనేరని ధర్మకార్యమని ఘంటాపథముగ జెప్పవలసి

వీలనన యీ అహింసాప్రోత్సాహజనితంబగు గ్రంథములు ప్రజలయందు ప్రేమతత్వమును బోధించి, తామసాహార నీచభక్షణ అనుచితంబని చాటించి విద్యావినయసంపన్నతల నందజేయుటకును, తద్వారా మనయందును లోకమునగల యితర సమస్తజీవులయందును బ్రకాశించెడి పరమేశ్వర చైతన్య మొక్కటియే యను భేదరహితజ్ఞానమును ప్రసాదించుటకును అందునంజేసి ఐహికవాంఛాతృణీకరణశక్తి లభించి భక్తిజ్ఞానవైరాగ్యము లుదయించి పరతత్వోన్ముఖులై నీతివర్తనులై ప్రవర్తిలుటకును అందునంజేసి భగవత్పాదారవిందనాళ్ళనకు అహింస ప్రథమపుష్పమని యెడి నిశ్చయ జ్ఞానమును బడసి తదేక ధ్యాననిష్ఠులై భ్రమరకీటకన్యాయమున పరమేశ్వరునియం దైక్యతనొందనేర్చుటకును తగిన విజ్ఞానవంతులుగ జేయును: గావున యీ పవిత్రోద్యమమునకు ఏ పుణ్యపురుషులు తమ సానుభూతిం జూపి ధన, పరివార, ప్రోత్సాహసహాయముల నొనర్ప సమకట్టెదరో అట్టి పుణ్యపురుషుల కార్యదీక్షకు వారివారి గోత్రముల ఋషులు దలలు పంకించి వేదోక్తాశీర్వాదము లొనర్తురు. అట్టి మహాదాతల పితృదేవతలు నేటికి గదా మామా వంశములయందు సుపుత్రులు బయలైవెడలి కుటుంబద్రవ్యమును సత్కార్య ఉద్యమాభివృద్ధికై వినియోగపరచి మమ్ముల దరింపజేసిరని వారి ధన్యవాదపూర్వక వంశవృద్ధి సూచకములైన స్వస్తివాక్యములతో దీవింతురు.

నేటికి గదా నాసృష్టియందు గల సర్వజీవచైతన్యుడనగు నన్ను సమభావమున గుర్తింపనేర్చిన ప్రహ్లాదునింబోలు చిత్త సంస్కారి బయల్వెడలెననియు, బలిచక్రవర్తింబోలు నిష్కా మ్యవదాన్యు డుద్భవించెనుగదా యనియు యీ సదుద్యమ దాత ప్రోత్సాహకులయెడల భగవానుడు కారుణ్యభావమును వహించి వీరు జంతువులను అకాలమృత్యువాతం బడకుండ రక్షించినట్లు అనేక జన్మలయందు గాపాడుటయెగాక బలి చక్రవర్తింబోలె ఆ మహోదాతలచెంగట లక్ష్మీసమేతుడై శంఖచక్రగదాధారియై నిలచి నిర్భీతిజీవనులగునట్లు జేయుటయే గాక అంత్యమున శాశ్వతానందపదవి నొందించితీరును. ప్రాణ దాన జ్ఞానదానములకన్న మించినధర్మకార్యములు లేమి గలవు! పరమార్థచింతతో పరికించిన యెడల మనదేశమున వక్రగతిని ప్రవహించు ధనప్రవాహముల జిత్తగింపుము. ఒకవైపున సురాపానపిశాచము. ఒకవంక కాఫీ తమాకుపాకులరక్కసి. వేరొకదిశ సినీమా నాటక పెనుభూతము. మరొకవంక సివిలు క్రిమినలు రాక్షసి. మరొకప్రక్క పరదేశ శకట యంత్ర సంపాదనోద్యోగ కౌతూహల ఘోరరక్కసి. ఇట్టి దేశసంకట దారిద్ర్యోత్పన్నములగు పిశాచముల వాతంబెట్టుచున్న మన ధనప్రవాహములు పరమార్థమున కుపయోగపడి మన జీవి తాంత్యమున ఎట్టి ప్రయోజనములుగాని నీయజాలవు.

పైన సూచించిన యే ఒక రక్కసినైనను సంహరించి అందుల సహస్రాంశమును యీ పవిత్రోద్యమమునకు జెందిం

చితిరా బీజమై మొలకెత్తి వృక్షమై పెరగి పుష్పమై పూచి ఫలమై ఫలించి దేశముయొక్క నలువైపులకు ప్రేమఫలరసానందము బ్రాకి. దేశసౌభాగ్యపరిపాలన కేర్పడి మీ రొనర్చిన దానఫలితమునకు ధర్మదేవత ప్రీత్యర్థమై విమానయానముచే కైవల్యప్రయాణము లొనర్చునట్లు జేసితీరను. తదుపరి పశువులయొక్క దోమబాధ నివారించునిమిత్తము రాత్రికంబముల బాతించి జీవకారుణ్యమూర్తి యని యశముగాంచిన నూజివీడు రాజ్యపరిపాలకులైన అప్పారాయరాజన్యునివంటి చిరయశస్సంపన్నులు కాగలరు. కావున దేశీయులగు సోదరులారా! అహింసా ఉద్యమ ప్రోత్సాహమునకై రచింపబడిన పవిత్ర పుస్తకములను పదేపదే ప్రకటించి జనులలో వ్యాప్తినొందుటకై ధనసహాయం బొసగి మీ పవిత్రనామములను పుస్తకముఖపత్రములయందు సువర్ణాక్షరములతో ప్రచురింపింతురేని మీ పవిత్రకార్యదీక్షకును, మీ అనన్య సామాన్యవదాన్యతకును, మీ నిర్మలాంతఃకరణ అవ్యాజప్రేమభావములకును తోడి మానవలోకము గ్రంథపీఠణపవిత్రసభామహార్ణము నందు పులకితదేహులై నేత్రములనుండి పవిత్రానందాశ్రుధారల నొలకించి మిమ్ముల ధన్యులనొనర్తురు. అదియునుంగాక అట్టి గ్రంథములను జదివి ఎందరెందరు అహింసాధర్మమవలంభింతురో అట్టి వారివలన కీడొందక మృత్యుబారినుండి ఎన్ని జీవరాసులు దప్పింపబడునో అన్ని జన్మములయందు అకాలమృత్యుబారినుండి తొలగింపంబడి పరమేశ్వరుని కరుణకు పాత్రులు కాగలరు.

# మానవులు మాంసభక్షకులా !

శ్లో. మాంసభక్షయితాఽముత్ర యస్య మాంస మిహాద్మ్యహం ।
ఏతన్మాంసస్య మాంసత్వం ప్రవదంతి మనీషిణః.

మనుస్మృతి 5 అ. శ్లో 55.

తా. ఇహలోకమున నేమనుజుఁడే యే జంతువుల మాంసమును దినియుండునో పరలోకమున వాని మాంస మా యా జంతువులు దినుటకై కనిపెట్టి యుండునని యును యిదియే మాంస భక్షకులగతియని యు పై శ్లోకార్థము.

సోదరమానవులారా! సృష్టియందలి సర్వజీవులకును ఆహారము దినుట, నిదురించుట, భయము జెందుట, సంభోగము జేయుట అనునవి సహజధర్మములై యున్నవి. కాని అసత్యమును త్రోసిపుచ్చి సత్యమును గ్రహింపగల్గుటయును, అధర్మమును విడచి ధర్మమార్గమున ప్రవర్తింప నేర్పుగల్గి యుండుటవల్లను యుక్తాయుక్త విచక్షణాజ్ఞానము గలిగి యుండుటచేతను మానవజన్మ ఉత్కృష్టమని భావింపబడుచున్నది. అట్టి పవిత్రజ్ఞాన శూన్యులగు నరులు ద్విపాదపశువులని ఉత్తరగీత బోధింపుచున్నది. అదియుగాక ప్రతిజీవియు మొట్ట మొదట పాషాణముగను పిదప వృక్షాదులుగను తరువాత కీటకములుగను, తర్వాత పాకెడి జీవులుగను తదనంతరము ఎగిరెడి పక్షులుగను అటుపిమ్మట జంతువులుగను పుట్టుచున్న

యుంచి యున్నారు. అనగా మానవజన్మములో మనస్సు, శరీరము పూర్ణవికాసమునొందుటచే విచక్షణజ్ఞానము కలిగి యున్న హేతువువలన మంచి చెడుగుల గ్రహింప నవకాశము గలదు. అందువలన వేదవేదాంగములగాని, పురాణేతిహాసములగాని, తర్క కుతర్కములగాని జదువనక్కరలేక ప్రకృతిని జూచియే మానవులు నీతిధర్మముల గ్రహింప ననే కవకాశముల కల్పించియే దయామయుడగు జగత్ప్రభువు సృష్టివిధానము నేర్పరచి యున్నాడు.

స్వర్గధామము జేరుటయో లేక నిరాకారులై భగవంతునిలో ఐక్యమగుటయో గాక అధః పతితులై నీచజన్మల నెత్తుటయో సంభవింపజేసికొను నరలీలారహస్య మెరుంగగల పవిత్రజన్మము మానవజన్మయే గావున వృధా కాలహరణ మొనర్పక నీతిమార్గమున ప్రవర్తింపుము. గతజన్మలయందలి జంతు ధర్మవాసనలవిడచి నరజన్మ పవిత్రతనుగన్గొని యుకోవి కాసముల మాని న్యాయదృష్టితో భగవానుని సృష్టిని విమర్శించి జూడుము. ! మానవులు మాంసాహారులా? లేక శాఖాహారులా ? అను ప్రశ్నకు ప్రకృతియే జవాబియ్యగలదు ! సృష్టియందలి జంతువులు రెండువిధములుగా నున్నవి. మొదటివి శాకాహారజీవులు. రెండవరకము మాంసాహారజీవులు ఏనుగ, గుఱ్ఱము, ఎద్దు, ఆవు, గేదె, గొఱ్ఱె, మేక, కోతి మొదలగునవి

పులి, నక్క, పాము మొదలగునవి మాంసాహారులు. ఈ రెండు తరగతుల జీవులను బరిశీలించి చూచినయెడల ఆహారస్వభావములలోను అవయవ నిర్మాణములలోను గల భేదము గ్రహింపగల్గుదుము. వీటిలో మాంసము దినెడిజంతువులు నీటినికతికి కతికి లొట్టలువైచుచు ద్రాగును. శాకాహారజంతువులు నీటిని మనుజులవలెనే పీల్చి త్రాగును. మాంసాధారజంతువులకు పిల్లలుపుట్టినవెంటనే కండ్లువిప్పి చూడనేరవు. అనగా వారము పదిదినముల పిదప గాని కండ్లు విప్పజాలవు. శాకాహారజంతు సంతానములు మానవులవలెనే పుట్టినవెంటనే కండ్లువిప్పి బాగుగచూడగల్గును. మాంసాహారజంతువులకు రాత్రిభాగమున కండ్లు జ్యోతులవలె బాగుగ కనుపించును. శాకాహారజంతువులకు నరులకు వలెనే రాత్రిభాగమున కండ్లు బాగుగ కనుపింపజాలవు.

మరియు మాంసాహారజంతువులకు వాడియైన కోరలు, వంపుగల్గినగోళ్లు, భయంకరమైన అరపు, క్రూరమైనచూపు, భయోత్పాతము గలిగించు రూపము, ఎంత అలసట జెందినను చెమటపట్టని శరీరతీరు, ఉష్ణమైన దేహము, కంపుగొట్టు శరీరమలినములు, అల్పాయుర్దాయము, మోటుశరీరము, బలహీనము రహస్యజీవనము రాత్రిసంచారము గలిగియుండును. ఇక శాకాహారజంతువులన్ననో మొద్దుబారిన దంతములు గోళ్లు నూత్న, మార్దవమైన అరపు, పగటిచూపు, భయములేనిఆకృతి,

అలసట జెందినపుడు శరీరమున చెమటబుట్టుట, కంపులేని శరీర మలినములు, బలముగలిగిన దేహము, ఓర్పుగుణము, కోమలమైన విశాలదేహములు, పగటిసంచారము, బహిరంగజీవనము గలిగియుండును. అదియునుంగాక అవయవనిర్మాణములోను, ఆకృతియందును మానవులను బోలియుండెడి కోతులు సహితము శాకములను మాత్రమె భక్షించునుగాని మాంసమును దరిజేరనీయవు. పైన వివరించిన అన్నివిషయములను బరికించి జూడ మానవుడు శాకాహారజంతుతరగతికి సంబంధించునుగాని మాంసాధారజంతుతరగతికి జెందనేరడు. పాశ్చాత్యప్రకృతి శాస్త్రతత్త్వవేత్తయగు 'డార్విన్' మహాశయుడు మానవులు శాకాహారజాతివారని సిద్ధాంతీకరించియున్నారు. అదియట్లుండ ఎంతటి యాపత్కాలంబడసియు సింగము గడ్డిదినుటకు దలపడదు. ఏనుగ మాంసము దినుటకియ్యకొనదు. అనగా ఒకజాతిజంతువు వేరొకజాతి జంతుధర్మమవలంభించదు. అట్టియెడ మానవులు సృష్టియందలి జీవులలో నుత్కృష్టులమని గర్వించుచు శాకాహారజాతివారయ్యు మాంసాహారము దినుట జాతిధర్మము వీడుట గాదా? స్వధర్మము శ్రేయమనియు పరధర్మము భయావహమనియు గీతాకారుని వేదవాక్య మతిక్రమించుటయే గదా? మానవులు మాంసము దినుట! కత్తిపీటలంబెట్టి కంపుగొట్టు కండమాంసమును కటుకుజెందక కసుక్కునగోసి కమ్మనయని దలచి కరకుబుద్ధితో కరుణవీడి దినెడివాడు మానవుడా? దాన

పుడా ? మానవ దానవ భేద మెందున్నది ? దినుటకై బ్రదుకు నవి జంతువులు ! బ్రదుకుటకై దినెడివారు మానవులు ! యిందలి రహస్యార్థము విచారించిన చక్కని ధర్మము గోచరమగును. అనగా దినుటయే ముఖ్యముగ నెంచు జీవులకు తృప్తిగాని అవధి గాని లేదు. కావున దిండికై చచ్చుచు బుట్టుచుండుటయే ఫలితము. ఇక బ్రతుకుటకు మాత్రము దినెడివారికి తినుటయందు కోర్కె లేనందున అట్టివారికి కోరదగినదేదికలదో అట్టి పరమానందపదవి లభింపును.

జననమరణములు, క్రోధలోభములు, లాభనష్టములు, భోగరోగములు సర్వజీవసామాన్యధర్మములు. కాని సమస్తజీవులయందలి సుఖదుఃఖములు తనవిగ భావించెడి పవిత్రజ్ఞానము గలిగిన సజ్జనులు మాత్రము మానవోత్తములై ప్రకాశింతురు. ఘాతుక జంతువులగు పెద్దపులి మొదలగునవి తా మితరజీవుల జంపునప్పుడు అవి యనుభవించు మరణబాధను గుర్తింపజాలక పోవుటచేతనే కదా క్రూరమృగములని యెంచబడుచున్నవి ! అట్లే మానవులు గూడ నితరజీవుల జంపునప్పుడు ప్రేమశూన్యులగుటచే దానవులని యెంచబడుదురు. కావున మానవులు హింసాకృత్యము లొనర్పదగదు. మధురమగు నేతిమిఠాయి నారగింపుచుండు మక్షికములు కొంపమునిగినట్లు ఝుమ్మని ఎగిరివచ్చి పాకివాని చంకనున్న అశుద్ధపుదట్టపై వ్రాలుటవంటిదిగాదా ! శుద్ధసత్వ ఆయురారోగ్యముల నొసంగు ఘృతక్షీరతక్రదధియు

తంబగు పరిశుద్ధాన్నంబును మధురోపేతంబులగు బిండివంటక ములును షడ్రసోపేతంబులైన కాయగూరలను విడచి మానవుడు మలమూత్రభాండ తామసాహార మాంసకండరముల దినుట కాసించుట! హాహా ఎంతవిపరీతము!

## మాంసాహారము అపవిత్రము-అసహ్యము-అనారోగ్యము.

శ్లో॥ నభక్షయతియో మాంసం విధింహిత్వా పిశాచవత్
సలోకే ప్రియతాం యాతి వ్యాధి భిశ్చ నపీడ్యతే॥
మను అ౫. శ్లో ౫౦.

తా॥ ఎవడు పిశాచమువలె విధి నిషేధమైన మాంసమును దినుచుండునో వాడు లోకమున అందరికిని విరోధియగును. అట్లు జేయక నిర్మలమగు సాత్వికాహారముల నెవడు దినునో వాడు లోకమందలి సమస్తప్రాణులకు మిత్రుడగుటయే గాక యేలాటిరోగములవల్లను పీడింపబడడు. మాంసభక్షణము పిశాచకృత్యమనియు రోగముల బుట్టించుననియు మనుభగవంతుని యభిప్రాయము.

మాతృగర్భంబున నునినదిమొదలు, ప్రసవవేదనాది దుర్భరకష్టముల ననుభవించి గని, మలమూత్రాది, అసహ్యముల భరించి పెంచిన తల్లిగాని, దనముందుగతిం జింతింపక విధి విధానంబగు దైవారాధనలనహితము మరచి ష నయుందు గల

మక్కువంజేసి, మనకు కొదువ యగునను భీతిచే దానధర్మములు, సహితము నాచరింపక, తాను గుడువక, నోరులకు బెట్టక, గష్టించి, మనకొరకు సర్వమును గుడువబెట్టి అల్లారుముద్దుగ సాకి పెంచిన తండ్రిగాని, దోడంబుట్టు అన్యోన్యప్రేమల మెలంగిన అక్కసెల్లెండ్రు, అన్నదమ్ములాదిగా గల రక్తస్పర్శ బంధుగులుగాని, సూత్రధారణ లగాయితు ఆహార, నిద్రా, శయ్యాల తమ దేహంబుల అన్యోన్యప్రేమలకొసంగి మెలంగిన భార్యాభర్తలుగాని, పుట్టినది మొదలు సహజవాత్సల్యతతో పెంచిన ముద్దుబిడ్డలుగాని, మరణించినచో? మరుక్షణముననే బీనుగగటంజేసి; దరింజేరవెరచి; అపవిత్రముగనెంచి; వెనుకటి ప్రేమంబులద్రోసివైచి; అసహ్యపడి; నిస్పృహంజెంది; తృణీకరించి; పారవేయుదమే! అట్టియెడ: ప్రాణములు పోయిన పిదప, లేవా జీవములు దీసినపిదప, జంతుకళేబరములు మాంత్రము బీనుగలు కావా? అట్టి బీనుగుల బికికొని తినుట ప్రారంభించు మనము కాకులమో! గ్రద్దలమో! రాబందులమో! కుక్కలమో! నక్కలమో! లేక బ్రహ్మరాక్షసులమో. ఒకక్షణము యోచించిన మహదానందముగల అవినీతి బహుస్పదగలము! మన నోటియందూరిన యుమ్మిని, మనగొంతునుండి గాండ్రించిన యుమ్మిని, గ్రింపవైచి తిరిగి ముట్టుటకు సహితము వెవగించు మనము ఉచ్చ, అశుద్ధము, చీమిడి, గుబిలి, కంటిపుసులు మొదలగు మలములతో గూడి శల్య రక్తమాంసములతో నిండి మరణవేదనచే బండ్లు గిట్టకరచి వికృతాకారములుగ

జూశట్టు నీచాతినీచమైన జంతుకళేబరమాంసకండరములను సకలార్థసాధనంబు లొనగూర్చి రక్షింపంజాలు శ్రావణ మంగళ గౌరీదేవిం బూజించి పవిత్రంబులైన సుకుమార సౌందర్య లావణ్యపతివ్రతా తిలకంబులగు మీ అంగనామణుల కోమలహస్తంబులచే గత్తిపీటలం బెట్టిగోయించి పవిత్రమంగళప్రదంబులగు మీ గృహావాసంబులను రుధిర, చర్మ, శల్యామయమా వృతంబులుగ నొనర్చి స్మశానవాటికలో యనునట్లు జేసి, పీనుగ పెంటలమయం బొనర్పకుడు! అట్టి భక్షణావలన మనకు యిహమా? లేక పరమా? ఘోరదుర్గంధ భూయిష్టమగు మాంసాహారమును జేసినపిదప హస్తంబుల నాసికలం జేర్చి ఆఘ్రాణించిన గలుగు అసహ్యము మరువ శక్యమా? మాంసాహారసేవనమున అజీర్ణము, అందువలన కఫోద్రేకము, దానిచే శైత్యోన్మాదము, దానివలన యుక్తాయుక్త వివేకశూన్యము, అందునంజేసి పరాభవము, దానంజేసి అసూయ దానినిబట్టి క్రోధము మాంద్యము పిదప అరిషడ్వర్గములచే బంధింపబడి ఇహమున శరీరసౌఖ్యమునొందక పరమున యమకింకరగదాఘాతములచే మర్దింపబడి ఆక్రందించి తుదకు నీచజన్మల నెత్తుదము.

కేవలము మలమూత్రములకు భాండమై, సప్తధాతువులతోడం గూడి, సమస్తరోగాశ్రయమై, శుక్లశోణితమయమై చర్మము, నెత్తురు, చీము, నరములు మొదలగువానితో నిర్మి

తమై దుర్గంధయుతమై నీచాతినీచమైన జంతుమాంసము లార గించు మానవుల కామాంసరసము జీర్ణించినపిమ్మట రక్తముగ మారి ఆరక్తము పురుషులయందు శుక్లరూపమును, స్త్రీల యందు శోణితరూపమును జెంది, ఉభయుసమాగ మానంతర ము న బిడ్డముగ నేర్పడి, తన్మూలమున గలుగుసంతానము నకు తలిదండ్రులవలన భక్షింపబడిన తమోగుణప్రధానంబు లైన దుర్గుణంబు లేర్పడి, అంధులై, మంధులై, కామాంధు లై, బుద్ధిహీనులై, యుక్తాయుక్త వివేకజ్ఞానశూన్యులై సం తానమాత్రయు భ్రష్టత్వమొంది నశింపుచున్నది. అందువలన మాంసభక్షణము ఆత్మనాశన హేతువగుటయేగాక వంశసంజా తుల పతితత్వమునకు మార్గదర్శికులగున ట్లొనర్చు మహాపాపము లకుసహితము బాల్పడ జేయుననిన ఆశ్చర్యము కానేరదు. ఔరా! నాగరిక శా మనీషులు స్మశానోదరులగుట ఎంతవింత !

---

## జంతుసృష్టి మానవభోజ్యమునకుగాదు.

---

శ్లో. ఆహారనిద్రాభయమైధునాని । సామాన్యమేత త్పశు
భిర్నరాణాం । జ్ఞానం నరాణామధికం విశేషం
జ్ఞానేన హీనః పశుభి స్సమానః॥ ఉత్తరగీత॥

తా॥ ఆహారముదినుట, నిద్రజెందుట, భయమును

వించుట మొదలగునవి మానవులకును జంతువులకును సమము గానే యుండును. "తనవలెనే సర్వమును" అనుజ్ఞానము మాత్రము పశువులకుండనేరదు. అట్టి జ్ఞాన మెవరికి లేదో వారు ద్విపాదపశువులుగాని మనుజులుకారని యుత్తరగీత బోధించుచున్నది.

భగవంతుడు జంతువులను సృష్టించినది మానవభోజ్యమునకుగాదు. మనలో గొందరు దాహమువట్టిన కుందేటికి మూడే పాదములన్నట్లు కోడి, మేక, గొఱ్ఱె మొదలగు జంతువులు మానవుల కాహారము నిమిత్తము సృజియింపబడినవని విపరీతవాదములు జేయుచుందురు. అది శుద్ధఅన్యాయము. మానవజాతి ఉపయోగించవలసిన వేదవిహితాహారమును అతిక్రమించి మద్యమాంసాదుల తినుట మొదలగు అత్యాచార దురాఖ్యానములకు పాల్పడి మృగాదులు మానవుల కాహారము నిమిత్తము సృజియింపబడినవని వాదింప మొదలిడుట ఘోర అన్యాయమై యున్నది. అట్లయినయెడల పెద్దపులి, సింహము మొదలగు ఘాతుకజంతువులు మొదటినుండియు నరులను జంపి తినుటకలవాటుపడి యుండుటను నాధారముగ నెంచి మానవులు ఘాతుకజంతువులగుసింహము మొదలగువాటికి ప్రత్యేకము యాహారము నిమిత్తము సృజియింపబడిరని యొక నూతన విపరీతవాదనోద్యమము బయలుదేరం దీసి సమర్థింపబడవలసి యుండును. మృగాదులు మానవుల కాహారము నిమిత్తము సృజింపబడినచో మానవులెందులకు సృష్టింప

యందు మానవజన్మలయొక్క సృష్టిహేతువునుగనుంగొనుడు. శీతవాతాతపాదులననుభవించుచు దరులకాగుల్మంబులుగనో, దారుణపాషాణ నిర్మితంబులగు పర్వతంబులుగనో, మంటిపురుగులమూత్రములను భక్షించు క్రిమికీటకాది నీచజంతువులుగనో, లేక క్రిమికీటకాది నీచాహారసేవనం బొనర్చు కాకగృధ్రాదిపక్షి సముదాయములుగనో, సృజింపక మనలకీమానవజన్మలనొసంగుట నిరపరాధులగు నోరెరుంగని అమాయకసాధు మూగజీవుల వధించి మాంసభక్షణజేసి పొట్టలనిమిగికొనుటకా? కాదు. కాదు. ముమ్మాటికిని కాదు. అనేకనీచాతి నీచజన్మలనెత్తి పూర్వపాపంబంతయు నశించినపిదప దయామయుండగు భగవానుడు మనయందు అపారప్రేమచే, యుక్తాయుక్తముల దెలిసికొను జ్ఞానమును మనకు ప్రసాదించి, సంసారనిస్సారంబుల గ్రహించి, అశాశ్వతంబులగు దేహాదులయందు విరక్తింజెంది, భక్త్యాదిపరలోకోపాయ మార్గంబుల ననుష్ఠించి, సర్వేశ్వరుని దెలిసికొని, ఆరాధించి, జన్మరాహిత్యమునొంది, తరించుటకై మనలకీ సర్వశ్రేష్ఠమైన మానవజన్మల ప్రసాదించినాడు గాని, నిరపరాధజీవుల హింసించి ఆరగించుటకు గాదు. తదుపరి జీవాత్మ లేనట్టి కళేబరములు శవములని గుర్తింపలేక వాటిని దినుటయందుగల అవినీతిని గ్రహింపనేరని అల్పజ్ఞుల మాటలను

గల వశత్వమును బారంద్రోలి నిజమానవుడై సారాంశము గ్రహించి : న్యాయంబారసి వచింపవలయునుగాని, తాము మునింగినది గంగ తాము వలచినది రంభ యను కువాదనల కాలము వ్యర్థపరుపరాదు. అప్రతిభాప్రభావ సంపన్నుండగు భగవానుని సృష్టిప్రభావంబును మనయందుగల మనోదుర్బలత్వమున గ్రహింపనేరక, అపార్థముల గల్పించుచు సందేహమనస్కులమగుట మిగుల విచారకరము. మనలో నింకా మరి కొందరు గొన్ని సాకులం జూపి భగవానుడే తనసృష్టియందు ఒక జీవి మరియొక జీవిని జంపి భక్షించునట్లు ఏర్పరచియున్నందున ఆహారమునిమిత్తము జీవుల జంపుట దోషముగాదనియు, అట్లుగానియడల బెద్దచేపలు మొదలగునవి చిన్నవాటిని జంపి భక్షించునట్లు, ఎండ్రలకు సృష్టివిధానము గల్పించెననియు వాటికి లేని దోషము మనకుమాత్రము గల్గునా? యనియు వాదింపుచుందురు. అట్టివారలు కేవలము జ్ఞానశూన్యములగు జంతుజీవితావిధానమునకును యుక్తాయుక్తము లెరుంగు మానవజీవితావిధానమునకును లంకెవైచి ధర్మనిర్ణయము జేయుట మిక్కిలి అర్థశూన్యము. అట్లయిన పెద్దపులి, సర్పము మొదలనగునవి బుట్టిన తోడనే దమపిల్లలనే దినును? అదియునుంగాక జంతుజాలములు వరుసవావు లెరుంగక దమతల్లులతోడనే సంగమించును! కాబట్టి మానవులుగూడ జ్ఞానరహితంబులగునిట్టి జంతుధర్మముల నాచరింపదగినదేనా? గావున జంతువుల సృష్టిక్రమము జ్ఞానరాహిత్యము లగుటచే అవియొనర్చు నూతనకర్మలకు దోషము

లేదు. అవి వాటి గతజన్మలయం దొనర్చిన కర్మలననుభవించు టయే గాని యీజన్మలయం దొనర్చు నూతనకర్మఫలితములు వాటికంటనేరవు. మానవుల కట్లుగాక జన్మాంతరకర్మల నను భవించుటయు, నూతన కర్మఫలితముల మూటగట్టికొనుటయు సంభవించుటకు హేతువు. భగవానుఁడొసంగిన వివేకజ్ఞానమే కారణము. జ్ఞానరహితుఁడగు బిచ్చివాని నేరమునకు శిక్షవిధిం తురా? లేబ్రాయమున దనివిదీర తల్లికుచంబుల గ్రోలిన సుతు నకు జ్ఞానోదయమైన వెనుక నాతల్లియైన దన కుచంబుల దృష్టిం పనిచ్చునా? బాల్యంబున పసిపాపలచెంత వస్త్రవిహీనులై స్వేచ్ఛగ మసలిన నారీమణులు జ్ఞానోదయమైనవెనుక పుట్టి వానిం దరిజేరనిత్తురా? కారణము యుక్తాయుక్త జ్ఞానాజ్ఞాన ములే ముఖ్యము గనుక కల్లబొల్లిమాటలతో బ్రసంగించుట అర్థశూన్యమగుటయే గాక లోకేశ్వరుని సృష్టివిధానమును విమ ర్శించినటుల మిక్కిలి సాహసమనిపించుకొనును. దానంజేసి మానవులు మానవసంఘ కట్టుబాటులను మరచి జిహ్వాచాప ల్యముచే జంతువర్తనముల ననుసరింపఁజూచుట, తత్తుల్యములగు నీచకృత్యముల నెత్తుటకు బ్రయత్నించుటయే యగును. జ్ఞానహీ నులు పశుతుల్యు లనుటలో యాశ్చర్య మేమిగలదు?

# జంతుహింస—కృతఘ్నత.

---

శ్లో॥ యోఽహింసకాని భూతాని హినస్త్యాత్మసుఖేచ్ఛయా ।
సజీవంశ్చ మృతశ్చైవ న క్వచిత్సుఖమేధతే॥

మనుస్మృతి॥ అ 5. శ్లో 45.

తా॥ ఎవడు జనుల కుపద్రవము జేయని నిరపరాధులగు సాధుజంతువులను తనయొక్క సుఖముకొరకు వధించునో యట్టి దుష్టాత్మునకు యిహమందుగాని పరమందుగాని [illegible] గాని ఎన్నటికిని సుఖము గలుగజాలదు.

పరమపావనులగు యో మానవసంఘీయులారా! [illegible] పతివ్రతాశిరోమణులగు భారత నారీమతల్లులారా! [illegible] మహా పుణ్యవిశేషమున మనకు లభించిన మానవజన్మల యొక్క జీవితోద్దేశ్యములను పూర్వపాపవాసనా విశేషమున గ్రహించజాలక మనమొనర్చు హింసాకృత్యంబుల మనసార దెలిసియు కనులారజూచుచు కనికరము జెందక వాటిని వధించుటకు మనము, దయాశూన్యులమై ఘోరపాపములను మూటగట్టుకొనుచున్నారము. శిశుఘాతుక స్త్రీహత్యాది భీకరపాపములకును, గురుద్రోహ భ్రూణహత్యాది ఘాతుకకృత్యములకును సహితము పశ్చాత్తాప కృచ్ఛచాంద్రాయణ జపతపాది ప్రాయశ్చిత్తంబులు గలవుగాని సమ్మ యుపకారమొనర్చు జీవులమేలు మరచి తుదకు వాటిని జంపి భక్షించు కృతఘ్నతాదోషమహా

పావులపాపములకు ప్రాయశ్చిత్తము లేదు. అట్టితరి మన మొనర్చు కృతఘ్నతారూపహింసాకృత్యంబుల దలంచినగుండె లదరుచున్నవి. దేహములు వణకుచున్నవి! జూచితిరా! మన కు మనోవాక్కర్మల నించుకేని అపకారం బొనర్పక మన యిండ్ల ప్రాంతంబుల పిల్లలువైచిన మెతుకులు, విడచిన మల మూత్రంబులనే గాక మురుగుకుండ్లలోని పురుగులను సహిత ము భక్షించుచు, మన గృహంబులకు పరిశుభ్రత కలిగించి, మనము వసియించుప్రాంతంబుల దుర్వాయువుల రాకుండ నాపి, మనము కనినబిడ్డలచందంబున, సాయంసమయంబున మార్జాలాదిదుష్టమృగబారినుండి తమను తప్పింపవేడునట్లు "క్కొ, క్కొ" యనుచు సంజ్ఞల జేసి, తట్టలక్రింద జేరి, మనము భోజనంబు లారగించు తరి జంటపిల్లలవిధంబున మచ్చికతో దగ్గరకువచ్చి, వైచిన మెతుకుల తినుచు, మనలను కేవలము తలిదండ్రులుగ నమ్మి, శరణుజొచ్చి, మన వద్దం జేరి, ప్రత్యుపకారంబుగ గృహకృత్య కృషివాణిజ్యాదులకు మనము పెందలకడ లేచునట్లు "క్కొక్కొరొక్కో" యని యరచి మేల్కొల్పి మనలకు సర్వవిధముల నుపకారంబు లొనర్చు కోడిపుంజుల గొంతుకలన్నా, మనము నులిమించుట!

మనము సంపాదించి తమను పోషింపనక్కర లేకుండ, ఆహారనియమముల సహితము పాటిపక, కనుపించిన ముండ్ల తుప్పలను తుదకు విషపూరితములైన జిల్లేడాకులనేగాక గన్నె రు మొదలుగాగల సమస్తతృణములను మేయుచు, తమ

ముద్దుబిడ్డలతోబాటు మన ముద్దుబిడ్డలకు సహితము రోగరహితములైన బలువనిపాల నొసంగి, మనజీవనాధారంబులగు బొలములకు ఎరవు నిచ్చి, మనము శీతబాధకోర్వలేమికి సహితము తోడవుకొనకుండునట్లు, తమ శరీరములమీఁది రోమములద్వారా కంబళుల నిచ్చి, మనమొనర్చు శుభకార్యంబుల మంగళధ్వను లొనర్ప వాటి దేహములనుండు చర్మముల నిచ్చి, మన కన్నివిధముల సహాయం బొనరించినవారలకా! గొఱ్ఱెపోతులకును, మేకపోతులకును, మన కతిదారుణకర వాల శిరశ్ఛేదనోద్యమ ప్రసాదములు!

మన యిండ్లఁబుట్టి, మన యిండ్ల బెరగి, బిడ్డలనాటినుండి అనుశ్రుతముగ సేయుచున్న వ్యవసాయమునకు మన కన్నివిధముల సాయంపడి, తమశరీరముల దాఁచికొనక, నాఁగలి కట్టి, మన కుటుంబములకు జీవనవృత్తి నిచ్చి పొలములకు ఎరవునిచ్చి, తుదకు జీవితాంత్యమున తమ శరీరములమీఁది తోళ్లను మన పాదరక్షలుగ నొసర్చి రక్షించిన వృషభమహిషములనా! కటికవాండ్ర కరకుకత్తుల కెరజేయుట?

మనము పుట్టినదాది, మాతృస్తన్యములకన్న నేయిరెట్లు గుణాధిక్యములైన తమపాల నొసంగి, మనలను బెంచి, పెద్దవారలుగ నొనర్చి, మనకు జ్ఞానోదయమైన వెనుక సులభముగ సేద్యముజేసి జీవింప తమ మగబిడ్డలను మన కిచ్చి, పొయిలోని కిచ్చి, పొయిమీఁది కిచ్చి, పాడి నిచ్చి, పంట

నిచ్చి, పాటి పాలనమ్మి జీవించుటకు జీవనోపాధి నిచ్చి, తమను భక్తిరసమున సేవించిన వారికి పరమపవిత్ర తరుణోపాయసాధన హేతువగు శాంతగుణమును ప్రసాదించి, తనకు మోక్షార్హతనొందింపజాలు పరమపవిత్ర ప్రశాంతమూర్తులగు గోమాతలనా! కటికవాండ్ర కంట్రకకత్తెరబోనుల కెర జేయుట! తళుక్కు-గుల్కు శరీరచ్ఛాయలతో నిందందు ఆనందముగ గంతులువైచుచు, నీటియందుగల కల్మషముల భక్షింపుచు, అందుండు క్రిమికీటకాదిరోగ ప్రదంబులైన నికృష్ట జీవుల బోనడచి స్వచ్ఛమైన జలముల మనకొసంగి వ్యాధుల రాకుండ కాపాడి మనల నారోగ్యవంతులుగ నొనర్చు మీనకూర్మములనా! గాలశూలములకెరజేయుట! నిశ్చయముగ నైయాయ విచారముల మరచి సంచరించు మానవకృతఘ్నులకు కృతఘ్నతాదోషహింసాజనిత మహాపాపభీకర రౌరవాది నరకములనుభవింపవలసి యున్నదనుట నిర్వివాదాంశము. అంతటితో సరిపోయినదా! మానవసంఘములయొక్క ధర్మశాస్త్రా! జూడుము! హాయిగ భగవంతుని కృపారసమున లభ్యమైన తనకుగల సహజసౌందర్య సౌజన్యతల నొప్పారుచు అచ్చటచ్చట తిరిగి, ఆనందముగ పాడి, యాడి, పండిన పండ్లమెసవి, చల్లనిగాలి వీచుచుండ, తమ అపూర్వవిజ్ఞానవిశేషములచే దేహసంరక్షణార్థము అందముగనల్లిన తమ గూండ్లంజూచి లోకంబచ్చెరువొంద, యుక్తాయుక్తమెరుంగని మానవబృందములకు సహితము అన్యోన్యదాంపత్యప్రేమల గలుప సుఖోపభోగించుటకో [illegible]

ప్రకటించుచు, వృక్షములపై ఆహ్లాదముగ కాలముగడపు నిరపరాధపక్షిజంటలను తమకరకుటమ్ములం దెగటార్చి! నెడబా టొనర్చి! తదాశ్రితపావదవ్యమున కుటుంబజీవనముల గల్పించుకొను మనకిరాతసోదరుల అన్యాయజీవహింసాపూర్వకద్రవ్యసంపాదనోద్యోగదుర్వృత్తికి దగినఫలంబేది? యట్టి వారికి పత్నీవియోగసంప్రాప్త్య స్వానుభవ జ్ఞానముచేగాని నాడు పక్షిజంటల దెగటార్చినవుడు అవి యనుభవించు చిత్తవైకల్యావియోగదారుణ దుఃఖబాధాజనిత ఆక్రందనములు స్ఫురింపనేరవుగాబోలు! నిండుజీవనములతో బొట్టలనీడ్చుకొనుచు, నిరపరాధజీవితములఁగడపుచు, తుదకు ఎందునకును బనికిరాని ఘోరఅసహ్యముతోఁగూడిన అశుద్ధమును, తమ పూర్వజన్మలబ్ధజీవనముచే గల్గిన పాపఫలితముగ మోయుచు, బ్రజల నమూత్రబారినుండి దప్పించి, పరోపకారమొనర్చ భగవంతునిచే సృజియింపబడిన పిండజీవులగు నిరపరాధసూకరములను నాలుగుకాళ్లు బిగియగట్టి దలక్రిందుగ వ్రేలవైచి దేహభారాయాసముసహింపనేరక మొఱ్ఱోయని మొత్తుచుండ, ఆకలిదప్పులకుం దల్లడిల్లుచుండ, పైనవైచినకట్లనలుగుల్లు పాదంబుల నలపివైన, తాపాగ్ని ఎండజ్వాలలు శరీరమంత మాడ్చుచుండ, దేహభారంబున ఆయాసంబుపడి శ్రమించుచు నేత్రములనుండి కన్నీటిదుఃఖాశ్రువులును, ముక్కునుండి నోటినుండి లోనికోశంబులుబటు తప్పటంబు జేసి స్రవించు జలంబు

లేరయ్యె బార తమను రక్షింప తోటి జీవులెవరైనం బొడసూ
పుడు రసుయాళ చే దిక్కులు ప్రతిధ్వనించునట్లు రొదసేయు
చుండ సంతలకు లాగికొనిపోబడి నేత్రములతో జూచుచుండ,
హాహోయని తత్తరపాటొందు చిత్తంబుల మొఱ్ఱోయను ఆక్రంద
నార్తనాదములు జెలగుచుండ, గిలగిలకొట్టుకొనుటకు సహి
తము పదబంధనమున వశముగాక చూపరుల కటికగుండెల
సహితము బగులగొట్టునంత ఘోరహింసా రూపవరాహ
మరణసన్నాహ పాపభూయిష్ట ప్రచండ యాతనాపూర్వక
దయాశూన్య మరణ ప్రహారోద్యమసాధనభూతులగు కిరాత
పోకరుల మానవత్వము మానవసంఘ నిర్మూలన పాప
హేతుకములుగాక మరేమి? యిట్టి ఘోరాతిఘోర హిం
సాకృత్యంబుల జూచి సహించుటయు, అమేధ్య భక్షణచే అప
విత్రమై తత్సారంబున వృద్ధింబొందిన వరాహ కళేబరంబుల
ఛేదించి తన్మాంసము నారగించుటయందలి అపవిత్రతాసహ్యం
బుల నెఱుంగక భక్షించుచుండు మానవజాతులకు తగిన ప్రచా
రంబు సల్పి మాన్పింపకుండుటయు, కృపాసముద్రుండగు భగ
వానుడు దేశపారిశుద్ధ్యంబున కనువగునట్లు సూకరముల సృజి
యించియుండ వాటిప్రయోజనంబుల గ్రహించి సూకరసంఘం
బుల నాశనంబొనర్పు మానవజంతుసంహారింపంజూడక ఐశ్వ
ర్యమత్తతం జనియించిన అజ్ఞానంబునం జేసి తోడిమానవజాతి
యులగు పాకీవారివాండ్రచే జన్మాంతర ప్రారబ్ధలబ్ధ ఘోరభ
య కర నీచాతినీచకష్టాది మహావ్యాధిపీడితులవలనసహితము

విడువంబడిన పులమూత్రములను మిఠాయిబుంగలు మోయించు నట్టుమోయుంచి నాగరికతాప్రపంచమున దాండవమాడుచుంటి మని విఱ్ఱవీగుచుండుటయు మిక్కిలి అవమానకరంబును లజ్జాహేతుకమునుగూడనై యున్నది కావున దేశీయులుబాగుగ నాలోచించి పాకీజాతీయులచే సూకరజాతిని పోషింపుటయు తన్మూలమున దేశపరిశుభ్రత గలిగించి హింసను మాన్పించి నచో నొకేసారి రెండు ధర్మముల నెరవేర్చి ధన్యులగుదురని నమ్మవలసియున్నది.

---

## జంతువులను పెంచి వధించుట పుత్రఘాతవంటిది.

---

పట్టెడుమాంసమున కాసించి క్షేతులారా పెంచి మనము మనసార నమ్మి కన్నబిడ్డలవలెపెంచి కడుప్రేమతోనున్నవి అనుగ్రహముగ పెరిగిన జంతువులను వధియుంచుట కేవలము కడుపు బుట్టిన బిడ్డల వధించుటవంటిదే యగును. హింసాకృత్యము కేవలము అసుర కృత్యము. దయార్ద్రహృదయులు దలంపరాని నీచకృత్యము. స్త్రీ పురుషాదులెల్లరును స్మరింపరాని ఘాతుకకృత్యము. అందువలను కడుపార నవమాసములు మోసి కనిపాపలగని పెంచు నాకము తల్లులు అంగీకరింపగూడని ఘోరనిషేధకృత్యము. ఏలనన్గా:— మన స్త్రీలు పొత్తిళ్లలో బసుండి ఎట్టివి కేత నాలుకలచే తల్లుల స్తన్యములనాని పాలుద్రాగు మన బిడ్డలకును, వాటి తల్లుల స్తన్యముల తమ ఎట్టివి కేకనాలుకలచే పాలు చుంబించుచు ఆహ్లాదమున తోకలు నాడించుచు పొత్తిళ్ల లో పెరిగిన ...

రగించు జంతుసంతానములకును, మన ముద్దుబిడ్డల చెంగు చెంగు గంతులకును, జంతుసంతానముల చెంగుచెంగు దాటులకును, మన పసిపాపల ముద్దుపలుకులకును, వాటి పసిపాపల ముద్దు అరుపులకును, మనబిడ్డల అందచందంబులకును, వాటి బిడ్డల రూపురేఖలకును, న్యాయదృష్టితో వీక్షించిన భేదంబు లేదను భావంబు మన మనంబుల నెలకొనిననాడే అద్భుతలీలా విహారుండగు సర్వేశ్వరసృష్టియందలి ఆనందమును యీ మానవ మహాని సర్వానుస్వభావంబును గ్రహించి నిజంబగు ప్రేమ తత్వమునొంది తరించువార మగుదుము. లేనియెడల మానవ రూపమున వెలయు క్రూరపశుతుల్యుల మగుదుమన్యాయము. నిజ మిగ మానవహృదయము నిండిన ప్రేమామృతరసంబులు నశించు చున్న యిట్టి కఠినతరఘోరతరాతిశయ హింసాకృత్యంబు లాచరింప గల్గుదురా! అయ్యలారా! మనవార లొనర్చు జాలికరంబగు హింసాకృత్యంబులం జూచి యూరకుండుట ధర్మమా? మీరక్త నాళములలో దయాంతఃకరణములు పొంగుటలేదా! మానుడు! మనమొనర్చు హింసాకృత్యంబులకతి దలంచిన మనంబు లెట్లు పరితపించునో! మనమందరమును బుట్టినపిదప జచ్చుట తప్పదను విషయము నెరింగియుండియు, దాత ముత్తాతలు, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు మొదలగు రక్తస్పర్శ బంధుగులేగాక యెరుగుపొరుగువారలనేకులు సహితము మృతిం జెందుట కనుబార జూచుచుండియు, మిక్కుటంబగు ప్రేమం

బున బెంచిన బిడ్డలు సహితము జచ్చిన కడుపుశోక మనుభవిం పుచు ప్రాణములమీఁది తీపిచే యట్టెకట్టుకొని యూరేగువార లవలె చావనినతోడనె దేహములు వణకి, గుండెలావులిఁప, ముచ్చెమటలు గారుచుండ గడగడలాడి భయపడుదుమే! అట్టి యెడ మానవులవలెనే తల్లిగర్భమున బుట్టి తల్లుల స్తన్యములు త్రాగి పెరిగి మనకువలెనే క్షుత్పిపాసలు మిత్త మాహార పానీ యము లారగింపుచు మనవలెనే ఆహారనిద్రాభయ మైథునాదు లంగలిగి మనవిధంబుననె పాంచభౌతికదేహంబుల పొల్లు బోసి కొనుచు, మనపోల్కిగనె రక్తమాంస శల్యాదులంగలిగి మన రీతినే చూచుటకు నేత్రములు, తినుటకు నోరు, రుచిందెలియు నాలుక, నములుటకు పండ్లు, ఆఘ్రాణింపుటకు ముక్కు, రమిం చుటకు రహస్యావయవములు, చరించుటకు కాళ్లు, శరీరంబున సప్తధాతువులు, స్పర్శజ్ఞానము, గుండెచలనము, ఉచ్ఛ్వాసనిశ్వా సములు, కంఠధ్వని యజమాని ఆజ్ఞను గ్రహించు గ్రహణశక్తి పుత్ర పుత్రికాప్రేమ, భార్యాభర్తల అనురాగము మొదలగు మానవానుకరణములైన విషయంబులనేకములు గలిగియుం డుట దెలిసియుండియు, మన ముద్దుబిడ్డలవలెనె, మచ్చికజేసి పెంచుచున్న మనలను జూచినంతనె సంతోషమున పొం గుచు, మన ఒడలెల్ల దనివిదీర నాకుచు, తమకు మనయందు గల ప్రేమభావంబు నాపికొనంజాలక మీఁది కెగురఁబోవుచు, దూరమున మేయుచున్నను మన పిలుపు వినినంతనే

ఆనందముగ గంతులవైచి పరువు పరువునవచ్చి, ఓరకన్నుల ప్రేమంపుజూపుల మనలం జూచుచు, మన దేహం బంతయు నాకుచు, యిండ్లయందు జంటిపిల్లల చందంబున గంతులు వైచి నాడికొనుచు మనలను తలిదండ్రులుగ భావించి కపట ప్రేమగాక నిజంబగు ప్రేమవిశ్వాసంబులంజూపు కరుణాపుం జంబులగు బుత్రతుల్యంబులైన పెంచిన యమాయక జంతుకూనలనా మనము కంఠనాళంబుల దెగనరకించుట! వాని మాంసమునా మనపొట్టలనింపుట కారగించుట! వానిరక్తమునా మనము గడుపార ద్రాగుట! నాయనలారా! వాని కంఠనాళములను మనము గరకుకత్తులచే నరకించునప్పుడు వాని శరీరములు భయముచే గడగడ వణంకుటను జూచి దిగులొంది మనశరీరంబు లేల కంపరపాటొందదేదు! మరొక నిముసమునకు మనము కంఠముల ఛేదించుదుమనగా యింకా దామెంతకాలమో జీవింతుమనునాశచే క్షుద్బాధ తీర్చుకొను నిమిత్తము నమలుచు, యింకా సగ మీావలకు వ్రేలబడు చున్న బద్ధిరకపరకలంజూచి మన కడుపులలోని అన్నము వెల వమనమార్గమున పోలేదు! మరణకాలము సమీాపించగా ఘోరభయంకర స్వరూపులగు యమభటులంబోలె నొకడు తలను లాగిపట్టి మరొక కటికవాడు తలను నరకుట కుద్యుక్తుండగు తరి పెంచినవాడవు నీవు ఆపత్సమయంబున కాపాడుదు

వను నాశతో నిను దలంచి నీవంక కనుగ్రుడ్లను ద్రిప్పి దీన వదనములతో నిను వీక్షించుచు నేత్రములనుండి వెలువరించు వానిదుఃఖాశ్రులంజూచిగాని ఆర్త, భయ, దుస్థితులంబరికించి గాని నీ నయనంబులు ఏల నీరు జలజలరాల్పలేదు ?

ప్రాణప్రయాణసమయంబున నిను దలంచి నీవు రక్షింప జాలకపోయితివి, నిను విడచిబోవవలసివచ్చె దండ్రీ ! అనుచు జెప్పందలచునూచనగ "అంబా" యని అరచిన దుఃఖమయం బగు కడపటి ఆర్తింగాంచి నీగుండె లేల బగులగొట్టబడలేదు! కంఠము ఛేదించిన బిదప నిను బ్రేమతో నాకి జాలింబొందెడి దల నకవైపునను, మొండెము వేరొకవైపునను బడి నిండుజీవి బలవన్మరణ మొందుటచే బాధను భరియింపజాలక గిజగిజ గొట్టుకొనునపుడు మానవుడవుగాన మరణవేదనను గ్రహింపం జాలిన నీవు జాలిందూలి వ్యథంజెంది మహోగ్రపాపకర్మ న్దలంచి శరీరంబెల్ల జెమ్మటలు గ్రమ్మ ఉన్మత్తుని జాడంబున నేల మూర్ఛం జెందలేదు ? ఓ దయామయులగు మానవసం ఘములారా ! మీ హృదయములు రాతినిర్మితంబులా ! మీ చూపులు నిర్దయాదృష్టులా ! మీ చేతలు దయాశూన్యములా! మన బిడ్డలు చిరజీవిబిడ్డలా ! మన యాలుబిడ్డలు దీర్ఘాయుష్మంతులా ! మన మొనర్చు దారుణభీకరనిర్దయా సహితంబులగు హింసాఫలం బేరీతి మనల బీడించునో యని తలంచిన గుండెలు బ్రద్దలగుచున్నవి. శరీరములు గగుర్పా

టొందుచున్నవి. పెదవులు ఆరిపోవుచున్నవి. అయ్యయ్యో! ఆయువులు సమీపించుచున్నవే! ఈ దేహములు శాశ్వతములు కానేరవే! మన మాసించు గృహక్షేత్రదారాపుత్రధనమిత్రాదులు మన వెంట రారుగదా! పుణ్యపాపముల యోజనచేయక దానధర్మముల సహితము మరచి యింటఁ బూడ్చియుంచిన ధనంబు వెకలించి తుదకు మన నామస్మరణమైనం జేయక హాయిగ విలాసార్థముగ ఖర్చుబరచి వినోదింపనెంచి నక్కపోతులవలె గనిపట్టి జూచుచుండువారలే గాని, వారి నందర సంతోషబరుపనెంచి హింసాదికృత్యము లొనర్చి జీవజంతువుల జంపి మాంసభక్షణ మొనర్చునట్లు జేయు అందలి పాపము లనుభవింప జాల్గొనువా రొక్కరైనను గలరా? ముదిమి బైబడి దేహము వ్యాధిగ్రస్త మగుతరి గోటిమంది వైద్యులు వచ్చియు కాలాంతమునకు ఆవరించెడి వ్యాధిం బాపంజాలక వాపోవుతరి రాత్రియో, బగలో. యింటనో, బయటనో, కఫవాతపైత్యములు బ్రకోపించి దేహమున నవరంధ్రములును శ్లేష్మపూరితమై శ్వాసింప వీలుంగావక గిజగిజ కొట్టుకొనుచు వాతంబు గ్రమ్మి గాలుసేతులు జల్లబడి, గ్రుడ్లు మిటకరించి, మరణవేదన జెందునపుడు, చుట్టములు బంధుగులు, స్నేహితులు, బిడ్డలు, భార్య మొదలగువారు బిక్కమొగములు వైచి చూచుచుండ, అవస్థం దెల్పలేక నసమర్థతగానక జూచుతరి, బాహ్యదృష్టిం దృష్టింపజాలక యున్నసమ.

యంబున, ఘోరభయంకరాకారుండగు యముండు, ప్రళయ కాలభీకరమేఘంబునుంబోలు శరీరచ్ఛాయతో, కాద్రిభీకర స్వరూపంబగు మహిషంబు నధిరోహించి, రక్తవర్ణనేత్రంబులతో యదలింపుచు కాలపాశంబు వైచి, ప్రాణంబుల బెకలించి దీసుకపోవుకాలము ఎదురగుచుండుట మరచి, యీమూడునాళ్ల ముచ్చట జీవితమును శాశ్వతమని భ్రమించి, యిక్కడాడిన యాటలు, బల్కిన బరుషంబులు, వైచినగంతులు జీవులవధించుట హింసగాదని వాదించు కుతర్కవాదనలు అక్కడకూడ సాగునని విఱ్ఱవీఁకుడు. నాయనలారా! జిహ్వాచాపల్యంబున నిండుజీవుల కంఠములను ఛేదించి పవిత్రజీవుల శిరములనరకించి, నిరపరాధులగు జీవులదెగటార్చి వాటిని స్వాభావదైవనియమితంబగు మరణంబుల నొందనీయక మన మొనర్చెడి బలవన్మరణ వేదనచే బాధకు దాళంజాలక గిజగిజ గొట్టుకొనుచు, అనాథలవలె వాపోవు ఆర్తిందూలు నిరపరాధులగు జీవుల మొరాలకించు ప్రభువు లేకపోలేదు! ప్రత్యక్షరాజదండన లేదుగదా యని గర్వింపకుడు. ఏపరాత్పరుడు మాతృగర్భంబుల బిండముల జఠరాగ్నిం దగ్ధంబు లొందకుండ రక్షింపుచున్నాడో, ఏ తేజోమూర్తి తన అఖండ దివ్యతేజంబున పదునాల్గు భువనంబుల బ్రకాశింపుచుండునో, యేప్రభావసంపన్నుడు పంచభూతంబులను దన యిచ్ఛచొప్పున నడపించి సృష్టిస్థితిలయంబుల నొందింపుచుండునో అట్టి ఆర్తత్రాణపరాయణుండగు

సర్వేశ్వరుడు తన సృష్టిక్రమంబున కడ్డుదవిలి ముందు వెనుక లారయక, యుక్తాయుక్తముల జింతింపక, పుణ్యపాపంబులం దలంపక, జీవదయాశూన్యులై కనులార జూచుచు, మనసార దెలసి, యీ పాడుపొట్టమేతకొరకు కాసించి మన మొనర్చుచున్న ఘోరహింసాపాపకృత్యంబులకు గినిసి యముగదాఘాతంబుల మర్దింపంజేయునో, మండుచుండు తైలధారలం ద్రావించునో, అగ్నిం బడద్రోయించునో, కరకురంపంబుల మన శిరంబుల నరకించునో, విచ్చుగత్తులంబెట్టి నాలుకల జీల్పించునో, ముండ్లకంపలంబెట్టి యీడ్పించునో, జీమునెత్తురులం ద్రావించునో, భయంకరమృగంబులచేత భక్షింపంజేయునో, గ్రుడ్లనూడ బెరకించునో, గాక మరే నీచాతినీచజన్మల నెత్తించి నేవిధంబున యాతనలపాల్జేయునో బాగుగ యోజించుకొనుడు. ఏల యన జీవహింసకు మించినపాపంబు వేరొండు లేదు. ఘోరాతిఘోరపాపంబని శాస్త్రపరిచయమున నే గాక ఆత్మచింతనవలనగూడ గన్పించుచున్నది. కావున వెంటనే హింసాకృత్యముల మాని పశ్చాత్తాపహృదయులై దైవమును శరణుజొచ్చి పాపవిముక్తు లగుదురుగాక!

సాధ్వీమతల్లులారా! పతిభక్తి, దైవభక్తి, స్నానములు, ఉపవాసములు, నోములు, వ్రతములు, దానములు, నియమములు, తీర్థములు మొదలగున వన్నియు మాంసభక్షణ మానకున్నయెడల వ్యర్థము లని ముమ్మాటికిని నమ్ముడు.

---

# జాతరలలో నసురపూజలు నిందార్హములు.

జాతరలలో మనలో గొంత యమాయిక ప్రజలు తండోపతండములుగ మూగి ధనమును ఆకర్షింపదలచిన పూజారి కుమ్మరి యింటనుండి తెచ్చిన క్రొత్తకుండకు సున్నపువాసినలు వైచి పూజఘటమను పేరున నెత్తిపై బెట్టుకొని యుక్తింగనిపట్టి గ్రామ దేవత తన్ను ఆవేశించినట్లు నటించుచు, కాగిళ్లసందున నూగుల నూగుచు గంతులు వైచుచు మూఢజనులను నమ్మించి, వారిపని పాటలన్నియు మంటగలిపి, నిశీథసమయమున నిదుర జెరపి ధమ ధమ ధ్వానములతో రాత్రిభాగమంతయు గడపి అమాయిక జనులచే నొసంగబడిన కుక్కుటశిరంబుల దనముని బంటుగ గత్తింపుచు, చీరలు, రవికలు, మొదలగు నైవేద్యముల గుంజుకొనుచు. వేలాది వేలు జంతువుల బలియగు నట్లొనర్చి, తన అపూర్వ చమత్కార నటనావిశేషంబుల గారడివాని చందంబున ప్రజలను మోసగించి తుదకు దెల్లవారగనే యింటికి జని సదరు పూజఘటమును దనభార్యకొసంగును. అంత నామె యాఘటమునకు జుట్టబడిన చీరలు, రవికలు మొదలగునవి తాను ధరింప దాచికొని ఆపూజఘటమును పెరటిలో బెంటకుప్పమీద విసరి పారవైచును. చూచితిరా! రాత్రింబవళ్లు మన అమాయిక జనులు పనిపాటలుమాని, ఆరాధించి, నోరెరుంగని అమాయిక మూగజీవులవధించి, దేశమును రక్తమయంబొం

దించు నట్లొనర్చిన మహాంకాళమ్మ పూజారివానియింట పెర టిలో పెంటకుప్ప అమ్మవారగుచున్నది. పరమ దయాళుం డగు భగవానుడు గుణభేదంబుల మోహితులైయున్న మాన వులలో దమ్ము ఆరాధింపదలచువారల మనమున నెట్టినిదాన మగు భావం బేర్పడియుండునో అట్టిరూపంబున బ్రత్యక్షమగు టకు నిశ్చయించి భక్తుల మనంబులు జెదరి అవ్యాయుత్తంబు లౌండకుండు నట్లనుగ్రహించుట నిమిత్తము పురుషులకు పురుష రూపంబునను, స్త్రీలకు స్త్రీరూపముతోడను దర్శనంబొసంగి తరింపజేయుదలంచి అన్నిరూపులుదాల్చియై అనుగ్రహింప బూనుటను మన అవిద్యాదోషమున గ్రహింపజాలక మూర్ఖు లమగు మనము గ్రామదేవతలను అన్యథాతలంచి భగవంతుని ఏకత్వమునకు భిన్నత్వము నాపాదించి, క్షుద్రదేవతగ భావించి, హింసారూపమైన జంతుబలి నైవేద్యముల సమర్పించి మహా పాపములను మూటగట్టుకొనుచున్నారము. జగదేకమాత స్వరూపుండగు భగవానుడు పరమ సాధుస్వరూపుడుగాని ఘోరరక్కసుడుగాడు! ఆసర్వ మంగళస్వరూపిణియగు భగవ దవతార జగదేకమాతకు అల్పులమగు మనమీయగలిగిన కానుక లేమిగలవు? భక్తికానుకనీయవలె. ఆమె సంతుష్టినం దవలె. అంతియేగాని రక్తమాంస, శల్యమలమూత్ర సహితం బులగు దుర్గంధశవములనా ఆమెకు సమర్పించుట! ఎంత వెర్రి తనము! ఎంత మూఢాచారము! ఈవిధానము మోక్ష

మార్గంబిచ్చునని మానహృదయంబుల జేతులువైచి చెప్పగల్గుదుమా? నిజముగ మన మనుకొనినయట్లు గ్రామదేవతలు శవములనే బలిగ గోరునంత ఘోరరక్కసిస్వరూపిణిలేమైనచో మన మ్రొక్కులకు మెచ్చి మానబిడ్డలనుమాత్రము రక్షించునా? రక్షింపదు. రక్షింపదు! ఏలయన శవములను నిత్యము బీకికొని దినుచు రక్తమాంస శల్యములారగించు ఆమెకు మన బిడ్డలను రక్షింపజాలినంత దయారసమెక్కడుండును. మనయొక్కయు మనబిడ్డలయొక్కయు మాంసముమాత్ర మామెకు జేదుగలిగించునా? గనుక మనలనుగూడ నమిలియే దీరును. రాక్షసస్వరూపమునకు యుక్తాయుక్త వివేకజ్ఞానముండునా? నాయనలారా! పచ్చకామిలరోగికి జగంబంతయు బచ్చనివర్ణముగ దోచునట్లును, పైత్యరోగికి లోకంబంతయు దిరుగుచున్నట్లగపడుచందంబునను అజ్ఞానాంధకారమునబడి కొట్టుకొనుచున్న మనకు ధర్మరహితంబగు శాస్త్రదూష్యంబైన యీపాడు హింసా సహితంబగు జంతుబలి విధానము ధర్మమువలె దోచుచున్నది. అదియునుంగాక మనబిడ్డలు మ్రొక్కులవలన జీవింపరు. అటులైన మన తండ్రితాత లేలజచ్చిరి? ఆయాజీవులు వారొనర్చిన జన్మాంతరప్రారబ్ధము బూర్తిగననుభవించునందాక జీవించియుండి కర్మానంతరమున క్షణికంబేనియు జీవింపజాలరు. మ్రొక్కులవలన ఆయువుల నిలిపికొనగలిగినచో దేశమున ప్రతివత్సరమున యిన్నిజావులేల తటస్థించుచున్నవి.

మనకంటె వేలాదివేలు లక్షోపలక్షలు జంతువులబలి నొసంగ జాలురాజాధిరాజులు సహితము ఆయువుల నిల్పికొనంజాలక జచ్చుచున్నారే! కలరా, మశూచికాది రోగములను మన మ్రొక్కులకు మెచ్చి గ్రామదేవత మనకు రాకుండ కాపాడిన యెడల కుష్ఠ్వాదిరోగములను మాత్ర మేల మాన్పింపరాదు. ప్రభుత్వమువారు కలరా, మశూచికాది రోగనివారణార్థము బంపు నుద్యోగులబట్టి యేల బీడింపరాదు? వారుమనకంటెను గూడ నెక్కువ జీవబలుల నీయగల్గుటను అమ్మవారు గమ నించలేదనియా మీ యభిప్రాయము. కావున "పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ పీడితః" అను నార్యోక్తిని గ్రహింపజాలక వెఱ్ఱిమొఱ్ఱి నమ్మకములకు లోనై హింసా పద్ధతిని దైవము నర్పించి పతితులమగుచున్నారము. కాబట్టి మనయందుండు బహుకాలంబైన అజ్ఞానంబును బారందోలి శాస్త్రనిర్ణయము చొప్పున హింసారహితమైన సాత్విక పదార్థ ములచే జగన్మాతను అర్చించి తరింపుడు.

సుజనులారా! ముఖ్యవిషయమును గుర్తింపుడు. చైత్రము మొదలు ఆషాఢమాసము ఆఖరువరకును అమిత మైన ఎండలు కాయును. అంతట వర్షము కురియగనే కాలిన భూమిపై నీరు పడినవెంటనే భూమిలోనియావిరి ఉష్ణరూప మున పైకెగసి మానవదేహములలో తత్వములను మార్పు జెందించును. వేసవియందు భక్షించిన మామిడికండ్లు, తాటి పండ్లు మొదలగువాటివలన పేరుకొనిన ఆమము ప్రకోపించి

జఠరమును తగ్గించును. దానిపై బలుహారమైన మాంసాదులు సేవించుటచే జీర్ణముగాక అజీర్తివలన వాంతులు, విరేచనములు ప్రారంభమై జనులు మృత్యువాలగుచున్నారు. సామాన్యముగ యిట్టి వ్యాధులు శ్రావణభాద్రపదములయందే గల్గుచుండును. ఇట్టి వ్యాధులు నూటికి తొంబదితొమ్మిదిపాళ్లు మాంసాహారుల యిండ్లలోనే తరచు సంభవించుచుండును. అట్టివారు పైవిషయములను గుర్తింపక గ్రామదేవత మాహాత్మ్యమని భావించి నూకాలమ్మ గంగమ్మ ఎల్లమ్మ, అసిరమ్మ, మరిడమ్మ, మహాంకాళమ్మ, పోలేరమ్మ, వాంతులమ్మ, భేదులమ్మ, తలువులమ్మ, దగ్గులమ్మ, మునుల్లమ్మ పరదేశమ్మ, పుంతలో ముసలమ్మ, సేరేళ్లమ్మ, దురదలమ్మ, తీటలమ్మ యని వింతపేర్లుగల దేవతలకు జీవబలుల నిత్తుమని మొక్కుచుందురు. అట్టివారిలో నూటికి 90 మంది మరణించి ఏపదిమందియో మాత్రము జీవింతురు. చచ్చినవారలు ప్రారబ్ధవశులనియు బ్రతికినవారలు అమ్మవారి మహాత్తువలన జీవించిరని భావింతురు గాని మొక్కులవలన జీవించినచో అందరును ఏల బ్రతుకకుండిరి? యను ఆలోచనయే బొడకట్టజాలకుందురు. పరిగడా దేవతయందు సహితము పూర్తినమ్మకము లేక ఒకవైపున వైద్యములుగూడ జేయింపుచుందురు. తనయందు దృఢనమ్మకము లేని యిట్టి కపటభక్తులను అమ్మవారెట్లు రక్షించునో తెలియదు! జనులను, పశువులను పీడించు అమ్మవారిశక్తి సర్కారు యుద్యోగుల ముందు ఎందుకు పనికి

రాకున్నదో బోధపడదు. కావున జనులారా! గణాచార్యుల యొక్కయు, తలమొల కామూళ్లకై యాశించు గుడిపెత్తన దార్లయొక్కయు బెదరింపులకు జడియక లోకిద మొక్కు లున్నవారలు వారివారి తృప్తినిమిత్తము వారాసంకల్పించిన జంతువుయొక్క శరీరమునకు సరిపడు విలువను వెచ్చించి, వండ్లు, ఫలాహారములు, చీరలు, రవికలు మొదలగునవి గొని కుంకుమపూజలతో అమ్మవారిని సంతుష్టిజేయుచు గ్రామములో పెద్దపెద్ద భూస్వాములు, లక్షాధికారులు వందలాది జంతువుల బలినొసంగు సమర్థతగలవారినందరిని వదలి చుట్టు గుడిశలయందు దిండికిలేక కాటికొంకల పీకుచు ఎలుకనో పందికొక్కునో, బావురుపిల్లినో, పీతనో తిని జీవించు నిరుపేదలే తనను సంతుష్టిజేసి తృప్తినొందింపగల గొర్రెలు, మేకలు మొదలగువాటిని బలినొసంగు సమర్థులని భావించి అమ్మవారు వారినే యాశ్రయించినదని తలంచుచుంటిరా? లేక సృష్టియంతకు ఒకదైవమును ప్రత్యేకము వారికొకదు దేవతయు యని భావించుచుంటిరా? మనహిందూ జాతము నందు వివేకులగు పెద్దలందరును ఏదారిని పోవుచుందురో యాదారినే యవలంబించుడు. అట్టిమొక్కులన్నియు ఎన్నడును అమ్మవారి నిమిత్తముగాదనియు వారివారి నాలుకమాత్ర వారికే వనియు ప్రజలు ముహూర్తకికిని గుర్తింతురుగాక!

సృష్టియందు దైవబలముచే అనేక జీవులు పుట్టుచు జచ్చుచుండ తన బిడ్డలనే ప్రత్యేకముగ మొక్కులవలన

నిలువఁబెట్టి లోకమునంతయు నుద్ధరింపఁదలంచుట వివేకలక్ష
ణముగాదు. ఆలుబిడ్డలకొరకు లక్షలాది జీవరాసుల జంపు
చుండు నట్టివారి కడుపుచలువవలనబుట్టి కేవలము క్రొవ్వు
లవలన పూర్ణాయుష్మంతులగు నాబిడ్డ లెన్ని జీవరాసుల
దమపొట్టల బెట్టికొని లోకనాశనము జేయువారగుదురో యని
దలంచిన విచారము కలుగుచున్నదిగదా! కావున దయా
మయులారా! వెంటనే మాంసాహారమును పూర్తిగ మానిన
యెడల కలరా మొదలగు అజీర్ణవ్యాధులు మిమ్ముల పీడింప
జాలవు. అంతట భక్తికొరకు పండ్లు, పుష్పములు, ధూపదీప
ములు మొదలగువానితో అమ్మవారిని పూజించి తరించుదురు
గాక! చిక్కగ దున్నిన చేనిలో మంచివిత్తనములు చల్లిన
మంచి యాహారము లభించునుగాని, ముసికివిత్తనములు
జల్లిన మంచి యాహారము లభించనట్లే, దయాస్వరూపిణి
యగు అమ్మవారికి భక్తిపూజ లొనర్చిన మంచిజన్మల నొసం
గును. హింసాపూజలొనర్చిన నట్టిహీనజన్మలనే యొసఁగిం
చును. కావున సాత్త్వికపూజలనే చేయుడు. మూఢాచా
రమును వెంటనే మానుడు. భగవంతుడు మిమ్ము రక్షించు
గాక! బలవన్మరణము పొందినవారు కాయజన్మయం దను
భవించవలసిన కర్మపూర్తిజేసికొనుటకై పిశాచజన్మల నెత్తు
నట్లే మీచే బలవన్మరణము పొందబడిన జీవులన్నియు పిశాచ
ములై మీరు దేహములు చాలించినపిదప మిమ్ములను బీకికొని
తినుటకై సిద్ధముగ యుండునను ధర్మరహస్యమును గ్రహించి
జీవహింసను మానుడు.

నట్లు శివసంహారము జేయుంచుచున్న నీ యమానుషకృత్య ములు వర్ణనాతీతములు గదా?

# యజ్ఞములు.

శ్లో. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోऽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥

భగ. అ 6. శ్లో 32.

తా॥ ఓ యర్జునుడా సమస్తప్రాణులయందును సుఖమునుగాని దుఃఖమునుగాని తననానిపోలికను సమముగ నెవ్వడు జూచుచున్నాడో ఆ ధ్యానయోగి పరమశ్రేష్ఠుడని నా నిశ్చయము.

చరాచరాత్మకంబైన భూతకోటిలోని ఉపాధులలో మానవదేహము, ముక్తినొందుటకు గరుడవాహనమువంటి దని పెద్దలు చెప్పుదురు. అట్టి ముక్తి లభించుటకు కర్మ, భక్తి, జ్ఞానములను త్రివిధములగు మార్గములు గలవని, వేదశాస్త్ర పురాణాదులు ఘోషించుచున్నవి. యుక్త్యనుభవశాస్త్రాదులచే తర్కించిజూడ, కర్మమార్గము ప్రథమావస్థయనిగోచరించును. అట్టి కర్మలు గూడ సాత్త్విక రాజస తామసికములని ముప్పిధములుగ భావింపబడుచున్నవి. అందు సాత్త్వికములు నిష్కామ్యములై జీవేశ్వరలఅభేదభావముతో జేయుబడునవి యనియు,

రాజసములనఫలాపేక్షతోఁగూడిన ద్రవ్యాదియజ్ఞము లనగా దేవాలయవాపీకూపతటాకాదిసప్తసంతాన ప్రతిష్ఠలాదిగ గల పూర్తకర్మలనియు, తామసములనగా హింసాదికృత్యములతో నెరవేర్చు యజ్ఞములాదిగాగల యిష్టాకర్మ లనియు గ్రంథవరిచయములవలన గోచరించును.

అదియునుంగాక పశువధతోఁగూడిన యజ్ఞములు చేయదగునా ? లేదా ? యను వివాదము అనేక యుగములనుండి జరుగుచున్నట్లు బొడగట్టుచున్నది. ద్వాపరయుగమునందు గీతాకారుడైన శ్రీకృష్ణపరమాత్మవంటి బోధునివలన ధర్మరాజంతటి న్యాయశీలునకు, ధర్మముల బోధింప నియమితుడైన నిత్యసత్యవ్రతుడును, ఊర్ధ్వరేతస్కుడును యగు భీష్ములవారు మహాభారత అనుశాసనికపర్వములో ధర్మరాజుతో యిట్లని శలవిచ్చిరి.

శ్లో. శ్రూయతేహి పురాకల్పే నృణాం వ్రీహి మయః పశుః ।
యేనా యజంత యజ్వానః పుణ్యాలోకపరాయణాః ।

తా. పూర్వకల్పములయందు పిష్టపశువులతో గూడిన యజ్ఞముల జేసిన చక్రవర్తులు పుణ్యాలోకముల నధిష్టించినట్లు వినబడుచున్నది. అని చెప్పియున్నారు.

అదియునుంగాక, మహాభాగవత చతుర్థస్కంధము నందు యోగీంద్రుడైన శ్రీనారదులవారు ప్రాచీనబర్హితో, నీవు యజ్ఞములయందు దయవీడి జంపినపశువు లన్నియు లోహ

భగవానులు గీతయందు శెలవిచ్చినారు. మనదేశమున హింసకులు బ్రబలుటచే మనలను జూచి జంతుజాలములు భీతిల్లుచున్నవి. కాని పూరీజగన్నాథమాదిగాగల పుణ్యక్షేత్రములందు కొలనులలో యుండెడి జలచరములు మనుజులను జూచి భీతిల్లక పాదములచుట్టును దిరుగుచు చక్కగ యాడుకొనుచుండును. అందులకు కారణము అచ్చటివారు వాటిని హింసింపకుండుటచేతనే గదా అట్టిభాగ్యమును మనమెన్నడు పొందగల్గుదుమో అప్పుడేగదా ధన్యులమై భగవత్ప్రీతిని బడయుగల్గుదుము.

## మానవులు నియమబద్ధు లేల కావలయును?

శ్లో॥ ప్రవిశంతి యథానద్యః। సముద్రం ఋజువక్రగాః।
సర్వేధర్మా అహింసాయాం। ప్రవిశంతి తథాధ్రువం॥

తా॥ సమస్తమైన నదులన్నియు సముద్రమున నెట్లు చేరుచున్నవో అట్లే అన్ని ధర్మములును అహింసాధర్మమునందు జేరుచున్నవి.

నేను, నాగృహము, నాభూమి, నాపొలము, నాభార్య, నాబిడ్డలు నాధనము, నాబంధుగులు మొదలగు మమకారములతో మానవుడు వాటినన్నింటిని తనకు సంబంధపరచుకొనుచు, ఇతరు లెవ్వరును వాటిని హరించకుండ జేసికొనుటకై ధర్మశాస్త్రములనుండిబుట్టిన రాజశాసనముల కెట్లు దాసుడై వాటిని

యందు లయ మొందింపవలయునని వేదములోని యంతరార్థ మని కొందరు భాషాకోవిదులును, వాదించువారు లేకపోలేదు. వ్యవహారము సందిగ్ధమునందున్నప్పుడు కర్మలోపమునకు వెరచు మరికొందరు దూరాలోచనాపరులు పిష్టపశుయజ్ఞములు జేయు వారు గూడ గన్పించుచునే యున్నారు. లౌకికయజ్ఞములు నిందార్హములే! వైదికయజ్ఞములు ఆచరణయోగ్యములై గన్పించినను పశుమారణపద్ధతి విచారకరము. పిష్టపశుయజ్ఞ ములు సర్వాంగీకారముగ జూపట్టును. ఏది ఎట్లున్నను, యుగ మా! ఘోర కలి. ద్రవ్యసంపాదనమా! కష్టతరము. ఆశ్రమ నిర్వాహకులా! అల్పము. శిష్టాపరులగు యజ్వలా! అరుదు. అందుచేత యజ్ఞములవలన దేశమున హింస ప్రబలుట కవకా శము లేదు. ఇందువిషయమై వ్రాయబూనుట అంతగా అవస రము లేకున్నను అహింసాచర్చ వచ్చినప్పుడు దీనిని ముచ్చ టించుట తప్పనిసరి గదా! పెద్ద లూహించి దేశకాలపాత్రము లనుబట్టి విధానముల మార్చుట అవసర మని గుర్తించునట్లు వేదపురుషు డనుగ్రహించుగాక!

# ప్రేమతత్వమహిమ.

---

శ్లో. అహింసా ప్రతిష్ఠాయాం; తత్సన్నిధౌ వైరత్యాగః॥

తా. ఎవనియందు అహింసాతత్వము నెలకొనియుండునో వానికి శతృవులు మిత్రులగుదురు.

ప్రేమతత్వమునందు చక్కని ఆదానప్రదాన (యిచ్చిపుచ్చుకొను) లీల గలదు. అనగా నీవొకరిని ప్రేమించినచో వారిలోని ప్రేమను నీ వాకర్షించుకొని తిరుగ వారిచే ప్రేమింపబడుదువు. అట్లే యితరులను ద్వేషించినచో వారివలన ద్వేషింపబడుదువు. గోవులు మొదలగునవి వాటియందలి ప్రేమతత్వము వలననే యితరులచే ప్రేమింపబడుచున్నవి. వ్యాఘ్రములు మొదలగునవి వాటియందలి క్రూరత్వముచేతనే యితరుల ప్రేమను ఆకర్షింపజాలక హింసింపబడుచున్నవి.

అట్లే పండ్లు దిను చిలుకలు మొదలగునవి ప్రేమాస్పదులగుచున్నవి. మాంసము దిను రాబందులను, గ్రద్దలను జూచి యెవరైన ప్రేమింతురా ? అట్లే మానవులలో అహింసకులు పూజింపబడుదురు. హింసకుల నెవరైన యాదరింతురా ? ప్రేమతత్వోపాసకులగుటచేతనే అడవులలో తపమొనరించు ఋష్యాదులను క్రూరమృగములు సహితము ద్వేషింపకుండుటకు కారణము ! ఎవని జూచి లోకమందలి యెల్లభూతములును భీతినొందకుండునో యతడే మోక్షపథమున కర్హుడని శ్రీకృష్ణ

భగవానులు గీతయందు శెలవిచ్చినారు. మనదేశమున హింసకులు బ్రబలుటచే మనలను జూచి జంతుజాలములు భీతిల్లుచున్నవి. కాని పూరీజగన్నాథములాదిగాగల పుణ్యక్షేత్రములందు కొలనులలో యుండెడి జలచరములు మనుజులను జూచి భీతిల్లక పాదములచుట్టును దిరుగుచు చక్కగయాడుకొనుచుందును. అందులకు కారణము అచ్చటివారు వాటిని హింసింపకుండుటచేతనే గదా అట్టిభాగ్యమును మనమెన్నడు పొందగల్గుదుమో అప్పుడేగదా ధన్యులమై భగవత్ప్రీతిని బడయగల్గుదుము.

## మానవులు నియమబద్ధులేల కావలయును ?

శ్లో॥ ప్రవిశంతి యథానద్యః। సముద్రం ఋజువక్రగాః।
సర్వేధర్మా అహింసాయాం। ప్రవిశంతి తథాధ్రువం॥

తా॥ సమస్తమైన నదులున్ను సముద్రమున నెట్లు చేరుచున్నవో అట్లే అన్ని ధర్మములును అహింసాధర్మమునందు జేరుచున్నవి.

నేను, నాగృహము, నాభూమి, నాపొలము, నాభార్య, నాబిడ్డలు నాధనము, నాబందుగులు మొదలగు మమకారములతో మానవుడు వాటినన్నింటిని తనకు సంబంధపరచుకొనుచు, ఇతరు లెవ్వరును వాటిని హరింపకుండ జేసికొనుటకై ధర్మశాస్త్రములనుండిబుట్టిన రాజశాసనముల కెట్లు దాసుడై వాటిని

శరణుజొచ్చి రక్షించుకొనుచున్నాడో అట్లే తనవారైనే ఆలు బిడ్డలయందు మమకారముతో కూడియుండెడి శరణుజొచ్చిన సాధుజంతువుల వధించిన పాపములపాలగుదురని యీ శాస్త్రములే జెప్పుచున్నందున శ్రేయస్కాములగు వారు వాటి యాజ్ఞలను విధిగా పాటింపవలయును. ఏశాస్త్రములనుండి బయల్వెడలిన గృహస్థాశ్రమాచార విహిత ధర్మములకు సూత్రధారణమాత్రమున దరిద్రులైనను, ఆచారహీనులైనను, నిందితులైనను, వికలాంగులైనను, కురూపులైనను, తుదకు మహావ్యాధిపీడితులైనను, కులాంగనలు యట్టివానిని విడచిపుచ్చకుండునట్లుజేసి నిజపతిరూప లావణ్య సౌందర్య సర్వాంగసుందరులగు పూర్ణేందుముఖులయ్యు బద్ధులై కాపురములంజేయునట్లొనర్చి పతిపతుల కభీష్టదాయకములైయున్నవో అట్టిశాస్త్రములే మాంసవృలకు నీచాహారమాంససేవనము సర్వారిష్టదాయకమని చెప్పినందున తప్పక వాటికి బద్ధులుగావలయును. అట్లే యేశాస్త్రాధారముల నూతగాగొని సన్నిపాతాదిభయంకరవ్యాధుల బోకార్చి ఆరోగ్యభాగ్యము లందజూచుచున్నారో యీ శాస్త్రములే మాంసాహార మనారోగ్యమని జెప్పుచున్నందున అనుసరించియే తీరవలయును.

అదియునుగాక ఏ ప్రపితామహియో మరణించిన యెడల ఆమెకు సంబంధించు ద్రవ్యక్షేత్రగృహాదులు తమకు జెందవలయు నని యేశాస్త్రముల నాధారముగ జేసికొని

న్యాయస్థానములయందు తమహక్కులను స్థిరపరపించుకొన జూచుచున్నారో యాశాస్త్రములే విధించెడి 'అహింసాపరమో ధర్మః' యను ముఖ్యసూత్రములకుగూడ బద్ధులై దాసానుదాసులై యుండవలెననియే నొక్కి జెప్పవలసియున్నది. లేనిమెడల యాశాస్త్రములు విధించినట్లే చెట్టయో, పుట్టయో, రాయో, రప్పయో, క్రిమియో, కీటకమో, కాకియో, గ్రద్దయో అయి బుట్టవలసియుండురు. అయ్యో! ఎంత విపరీతము!

---

## మాంసభక్షకులగువిదేశీయుల తెలివియెట్టిది ?

---

మాంసభక్షణవలన తెలివితేటలు నశించుననిచెప్పుటతోడనే విదేశములవారు మాంసభక్షకులయ్యు తెలివితేటలుగలవారుగ లేరా? యని ప్రశ్నించెదరు. తెలివి పలువిధములై యున్నది. అందు సాత్త్విక తెలివి, తామస తెలివి అని వ్యవహరింపబడు వాటినే భగవద్గీతలో దైవీసంపత్తు యనియు, అసురసంపద యనియు రెండు రకములుగా జెప్పబడినవి. దైవీసంపదతో గూడిన అనగా సాత్త్విక తెలివి యిహమునకును, పరమునకును సుకరమై తన్నుదాను తెలిసికొనుటయే గాక, లోకమును, లోకాంతరములనుగూడ గుర్తింపజేసి భూతభవిష్యద్వర్తమానములలో దేహాత్మల రెంటికిని గూడ సుఖమునే కల్గించునదిగ యుండును. ఇక యసురసంపదతో గూడిన తెలివి—అనగా తామసతెలివి, పైకి సుకరముగ గన్పించినను కాలక్రమమున

ఇహపరదూరులగు నట్లొనర్చి, అనగా అట్టి తెలివియే తనపై నధికారము వహించి తుదకు తన్నుతాను మరచునట్లు జేసి దేహాత్మల రెంటినిగూడ దుఃఖమయమొనరించును. జూడుడు! విదేశములవారి నేటి సైన్సు, కెమిస్ట్రీల విజ్ఞానము లెట్లు పరిణమించి వారిపాలిటి యమదూతలై వారి నెట్లు నరకకూపమున గూల్పద్రోయుచున్నవో పరికించుడు.

వారు నిర్మించిన కారులు, టాంకులు వారి కళేబరముల మీదుగ బరువులెత్తి తుత్తినియలు జేయుచున్నవి. విమానములు నిప్పులవర్షమును గురిపించి వారిని వారిదేశములనుగూడ భస్మీపటలము జేయుచున్నవి. దూరశ్రవణయంత్రములు వారి గుట్టునంతయు బయటవేసి వారిని హాతమార్చుచున్నవి. విద్యుద్దీపములు ఆరిన గాని బ్రతుకులు సున్న యని జెప్పుచున్నవి. రైళ్లు, స్టీమరులు, కారులు మొదలగునవి వారికి సుఖాసనము లగుటకుగూరు శవముల నీడ్చుటకు పనికివచ్చుచున్నవి. అసుర సంపదతోగూడిన తామస తెలివి యనగా యిట్టిదియే యని గ్రహించుడు. స్వనాశనహేతువగు భస్మాసుర తెలివి; మాత్సర్యరూపమగు శిశుపాల తెలివి; ప్రేమశూన్యమగుకంస తెలివి ; దేశధనబంధుపుత్రమిత్రనాశనహేతువగు రావణ తెలివి ; తెలిసినదా ? నాయనలారా ! మొదటిలో వారును ధగధగ మెరసిన వారలే సుమా ! తుదకు నశించిరిగాని. కాబట్టి వికటవాదన లొనర్పక తామసిక మాంసాహారవర్జితులై శాఖాహారము లొన

ర్చుచు శాశ్వతసుఖయశోవర్ధకములగు దైవీసంపదతో గూడిన సాత్త్వికతెలివిని సంపాదింప బ్రయత్నింతురుగాక !

---

## హింస ప్రకృతిస్వభావమైనను మన మేల హింసింపరాదు ?

---

భూకంపములు, అగ్నిపర్వతములు, పిడుగులు, గాడ్పులు వర్షములు మొదలగువాటివలన ననేక జంతుజాలములు నశింపు చున్నవిగదా ! మన మేల జంపరాదని భావించువారు లేకపో లేదు. దైవకల్పితములైన యాపదలు స్వభావము లనబడును. తాను సృష్టించిన జగత్తును దయయుంచు చొప్పున వృద్ధిబొందించి లయింపజేయు సర్వాధికారియగు ప్రభువు దైవము. తాను పెంచిన సస్యమును రైతు తన యిష్టానుసారము సాగుచేసి తన రబుచేసికొనును గాని ఇతరులు దొంగిలించిన సహించునా ? అట్లే తాను సృష్టించిన జీవుల సృష్టిస్థితిలయములకు పరమేశ్వరుడే యధికారి యని గుర్తింతురుగాక ! రైతునకు విత్తులు జల్లు నప్పుడు దొరకు యానందముకన్న చేనుపెరిగిన పిదప మరియొకానం దమును కోయునపుడు యింతకన్న బ్రహ్మానందమును యెట్లో అట్లే యీశ్వరునకు సృష్టించి, పోషించి లయింపజేయు టెల్లను యాతని వినోదములేగాని మానవజోక్యములుగావు. దైవా జ్ఞచే మరణించినవారిం జూచి స్వభావమరణము లని యూరక డిల్లుదుము గాని ఇతరు లెవరైనను మనవారిని జంపజూచినచో ఎప్పటికైన జచ్చువారలే గదాయని యూరట జెందుదుమా ?

కాపుని అనధికారముగ మానవుఁడు జంతుహింస జేసినచో దైవమువలన శిక్షింపబడుదుము.

వ్యవసాయదారు తనసస్యములను క్రిమికీటకాదులు, ఎలుకలు మొదలగునవి బాడుజేసిన కోర్చుకొనునుగాని పాలికాపు హరించిన యంగీకరించునా ? యట్లే జగత్కర్త యగు దైవము తనసృష్టియందలి జ్ఞానశూన్యములగు సింహములు, పులులు మొదలగువాటివలన సంభవించు హింసాదికృత్యముల సహించునుగాని కేవలము తనయంతవారగుటకు తగిన విజ్ఞానమొసంగి నియమింపబడిన మానవులు సృష్టినాశనకారణమగు హింసలొనర్పబూనిన సహించునా ? పాలికాపు తనకు భూస్వామి యేర్పాటుజేసిన నియమితభత్యముతో కాలము గడపునట్లే మానవులుగూడ సర్వేశ్వరునిచే యేర్పాటు చేయుబడిన సాత్త్వికాహారములను మాత్రము స్వీకరించి హింసాకృత్యముల విడువవలెను. అట్లుగానిచో శిక్షాపాత్రులే గదా ?

---

## దేహబలమునకు మాంసాహార మవసరమా ?

---

శ్లో॥ రూప మవ్యంగతా మాయుర్బుద్ధిం సత్త్వం బలంస్మృతిం
ప్రాప్తుకామై ర్నరై ర్హింసా వర్జితో వై మహాత్మభిః॥

మహాభారతం అనుశాసనిక పర్వం అ 114.

తా. సౌందర్యము, అంగలోపము లేకుండుట, ఆయువు, బుద్ధి, శాంతము, బలము, తెలివి మొదలగునవి గావలయునని కోరెడి నరులు హింసాకృత్యములు విడవవలెను.

కేవలము రాకులను, గడ్డిమాత్రమే దినుచు గలలో నైనను మాంసమును రుచిజూడనొల్లక మిక్కిలి బలమువలన విరాజిల్లుచు పర్వతములవలె జూపట్టి మితిమీరిన శరీరకండ పుష్టిగలిగి మదించిన ఏనుగగున్నలు మాంసాహారమువలన గాని బలము లభించి శరీరము బలుపు జెందనేరదని భావించు తెలివితక్కువ మనుష్యులను జూచి ఘకాళించి నవ్వుచున్నవి. తవుడు, చిట్టు, పొట్టు గడ్డి మొదలగువాటిని మాత్రము దినుచు మాంసమును వాసనయైనం జూడనొల్లక తమ దేహబలముచే ధరాతలమును పెకలించి నాగలి దున్నుచు, మోటలలాగి పాతాళమునందుండు జలమును పైకి విసరివైచుచు, అమిత బరువు వైచినను శకటములనవలీలగ లాగుచు యింకా ఎన్నిరోపలు విధములైన వ్యవసాయమున కుపయోగపడెడి కష్టతరమైన పనులంజేయు ఎద్దులు, దున్నలు, గుఱ్ఱములు మొదలగు జంతువులు కలువులాగుట మొదలగు నానా యాసపు వ్యవసాయపనుల నిర్వర్తించి యోర్చుకొనుటకు మాంసాహార మవసరమని భావించు మూఢమానవులజూచి పరిహాసము జేయుచున్నవి. చక్కని కాయలను, పండ్లను భుజియించుచు నేత్రములతో జూచుటకు మిక్కిలి ఇంపుగలిగించెడి సౌందర్యములగలిగి కర్ణరసాయన మొసంగు దీయని

మాటలుగూడ నాడనేర్చిన చిలుకలు, మైనగోరువంకలు మొదలగు పక్షిజాతిగూడ మాంసాహారమునే నాలుకలు మొద్దుబారి తల్లిభాషనుగూడ స్వచ్ఛమైనమాటలతో బలుక జాలని మోటుమానవులను జూచి కిచకిచధ్వనులతో ఎక సక్కెములాడుచున్నవి. తోక యున్నంతమాత్రమున మీ కంటె హీనజాతికి సంబంధించిన మృగములమయ్యు అన్ని విషయములలోను మిమ్ములనే బోలి యుండెడి మమ్ములను జూచియైనను నీచమాంసమును విడువవలదా యని నరులను జూచి కోతులు వెక్కిరించుచున్నవి. వేరుగతిలేక బొరియలలో దాగియుండి నిశీథసమయమున పిశాచరులవలె చరించుచు కడుపుబాధ దీర్చుకొను నిమిత్తము పీకికొని తినుటకై మే మాసించెడి చచ్చిన జంతుపీనుగులను మీరే యాసించి మాకు చెందకుండ జేయుచున్నారా యని మానవులంగూర్చి నక్కలార్చుచున్నవి. రాబందులు మొరుక్కుచున్నవి. కాకులును గ్రద్దలును కూపెట్టుచున్నవి. కావున మానవ సోదరులారా! వెనుకకు మరలుడు. నీచమైన మాంసాహారము బలముగలిగించునను యాసను విడచి విసర్జింపుడు. ఆరోగ్య మునకు శాకాహారమే ప్రశస్తమని విదేశములయందుగూడ వైద్యులు పత్రికా ప్రచార మొనర్చుచుండుటను గమ నించుడు.

# అండమ్ముల భుజించుట హింసయేనా ?

---

ఆ॥ జీవి జీవి జంపి, జీవికి వేయగా-జీవివలన నేమిజిక్కెయుండు
జీవహింసకులకు జిక్కునామోక్షంబు-విశ్వదాభిరామవినురవేమ.

కోడి, బాతు మొదలగువాని గ్రుడ్లను భక్షించుట కూడ హింసయే యగును. దయామయుడగు భగవంతునిచే ఎట్టిదో యొక యుద్దేశ్యముపై అండరూపమున సృజింపబడి, మున్ముందు పరిణామావస్థచే దేహరూపమొంద నేర్పాటు కాబడిన అండముల భేదించుటకూడ గర్భస్రావమువంటి భ్రూణహత్యాదోష మొదవింపజేయును. అండరసభక్షణ కూడ తమోగుణముల నభివృద్ధికరచి మానవుని అధఃపతితునిగ జేయును. కావున గర్భస్థపిండమును జంపునట్టి దయారహితమైన యిట్టి అసురకృత్యములు! వీటనే దొలగించినగాని పాపరహితులు కాజాలరు. అయితే మనము శ్వాసించునప్పుడును పెదవులు మొదలగునవి మెదల్చునప్పుడును త్రోవనడచునప్పుడుచూడక త్రొక్కుటవలనను, త్రాగునప్పుడు నీటియందు నశించెడి జీవుల యొక్కయు హింసాదోషము నరులకు కలుగజాలదు.

శ్లో॥ యస్యనాహం కృతోభావో బుద్ధిర్యస్య నలిప్యతే॥

తా॥ ఎవ్వడుదాను బ్రాణులనుచంపుచున్నానని ఆత్మకు తెలియరాకయు, బుద్ధికిగోచరముగాకయు నశించెడిప్రాణికోటులనుగురించి తెలియకయున్నాడో వానికి వాటిచే పాపము

కలుగజాలదని భగవద్గీతలో సృష్టికర్తయగుపరమేశ్వరుడే సెల విచ్చినందున అట్టివానింగూర్చి తర్కించిన ప్రయోజనములేదు.

---

## మాంసాహారము రుచియా ?

---

చ. క్రిమిసముదాయ సంకులము గేవలనింద్యము పూతిగంధి
హేయమును నిరామిషంబును ఖరాంగభవంబగు నెమ్ము;
గుక్కదానమలుచు; జెంతనున్న సురనాథుని గన్గొని
సిగ్గుచెంద, దల్పమని నిజస్వభావము దలంపదునీచపుబ్రాణి
యెయ్యెడన్.

భర్తృహరి నీతిశతకము మూర్ఖపద్ధతి.

తా॥ పురుగులసమూహముచేత పొదువుకొనబడి చెడు కంపుకలిగి తననోటి చొంగవలన తడసి రోత గలిగించునదై, మాంసములేనిదై, యున్న గాడిదయెముకను కొరుకుచున్న కుక్క, ఉత్తమరుచులయందలి సంతోషమును పొంది, తన దగ్గఱనున్న దేవేంద్రుని సహితము జూచి లజ్జింపదు. ఇట్లే లోకములో నీచుడు తానుగ్రహించిన దాని తుచ్ఛత్వమును తలపోయడు.

పచ్చిమాంసమునకు స్వభావమైన సొగసుగాని, రుచి గాని లేదు. దానిమీఁదను మిశ్రము చేయబడుచున్న నేయి, నూనె మొదలగు తైలములవల్లను, మసాలావగయిరా దినుసులు మొదలగువాటి కలయికవలనను, సుగంధ పరిమళద్రవ్యాదులైన యాలకులు, దాల్చిని మొదలగువాటిని జేర్చి వక్క

వరచి ఉప్పు, పులుసు, కారములవైచి రుచియగునట్లు తయారు జేసి మాంసాహారము రుచియని భావించుట కేవలము తెలివి తక్కువమైయున్నది. ఇచ్చటనే గమనించవలసిన ముఖ్య విషయము గలదు. మీరు భావించురుచియంతయు అందు సమ్మేళనజేసిన మసాలా వగైరా ద్రవ్యములకు సంబంధించినది గాని స్వతహాగా మాంసము యొక్క రుచిమాత్రము గానేరదని గుర్తించవలయుగాక! పచ్చిమాంసము నెవరైన రుచియని భావించి వహించగలరా? నూతిలోనికప్ప నూయియే ప్రపంచ మని తలంచునట్లు మాంసభక్షకులు దానినే పొగడుచున్నారు నాయనలారా! గరికివేళ్ళ ఇచ్చుడికి రాజు యాశ్చర్యపడి గరిక వలన అగ్రహారములను ధారాదత్త మొనర్చిన విషయము మీకుం గదా? మాంసాహారమె సుపక్వమైన నెట్టి బహుమానములను పొంద గలిగినదా? మొదటినుండియు మాంసాహారుల యిండ్లలోని వంటవారలు ఒక్క మాంసపదార్థములయందే శ్రద్ధవహించి యందు జేర్చవలసిన దినుసులను సంపాదించి రుచివంత ముగ తయారుజేయుట నేర్చుకొని కాయగూరల వండునపుడు మాత్రము తగినశ్రద్ధ వహించక సరిగ పక్వపరుపజూడక మాంసమునకున్న రుచి కాయగూరలకు లేదని భావించు చున్నారు. [illegible] లకంటె తక్కువ ఖరీదునకు లభించు దినుసులను వైచి తయారుజేయవలసిన విధిప్రకారము వండబడిన యెడల కాయగూరలు మాంసమునకంటె అధిక రుచివంతములుగ నుండును. మాపిండివంటలయందు చిక్కపడి ఖాండలి "జేడి" యను పదార్థమును [illegible] యుపసంధించు

రెక్కలుగల పురుగులు పెంకయొక్క పైభాగమునసేయున్న అమృతమువంటి తీపిరసమును గ్రహింపజాలనట్లు మాంసాహారులు కాయగూరల రుచిని గ్రహింపలేకున్నారుగదా? ఎంత విచారకరము!

## ఆహారభేదములు గుణత్రయ వివరణము.

సృష్టియందలి జీవకోటులన్నిటికిని యనుభవించు యాహారపదార్థ వస్తుగుణములనుబట్టి మనోవృత్తు లేర్పడుచున్నవి. అట్టి మనోవృత్తుల ననుసరించి స్వభావమును, భావానుసారమగు నడవడియు, నడవడినిబట్టి జాతియు, జాతిననుసరించి గౌరవమును, కలుగుట కవకాశముకల్గును. భుజించెడి ఆహారపదార్థములన్నియు జీర్ణించి రక్తముగ మారి ఆరక్తము శరీరమంతయు వ్యాపించి ఎముకలు మాంసము, మెదడు మొదలగువాటిని దృఢపరచి మానసికశక్తుల కలుగంజేయును; గావున మానవులు ఆహార విహారములలో కడుజాగరూకులై యుండవలెను. అట్టి మనోవికారములగు మార్పులనే సత్వరజస్తమోగుణములని పేర్కొనబడినవి. ఆహారభేదములను నాటిలక్షణములను యీక్రింద వివరించడమైనది.

### సత్వగుణము.

కందమూలములు, పాలు, పండ్లు, శాకాహారములు మొదలగు వాటిని భుజించు మానవులు సత్వగుణ ప్రధానులై

శుచి, శుభ్రము, దేహారోగ్యము, తేజస్సు, సూక్ష్మగ్రహణము, సర్వభూత సుహృద్భావము, యింద్రియ నిగ్రహము, నిర్మలమనస్సు, భూతదయ, భగవద్భక్తి, నిత్యానిత్య వస్తు వివేకజ్ఞానము మొదలగు పవిత్రగుణముల గలిగి యుండుటయే గాక భయము లేకుండుట, లోక వ్యవహారములందు పరుల విషయమై అసత్యము, మోసము, మాయ మొదలగునవి లేకుండుట ఆత్మజ్ఞానోపాయమెరింగి నిష్ఠయందుండుట, తన శక్తికొలది యున్న వస్త్ర ద్రవ్యముల బాత్రతనెరిగి నితరులకు దానంబొసంగుట, బాహ్యేంద్రియముల జయించుట, దేవ, పితృ, భూత, మనుష్యయజ్ఞము జేయుట, వేదాధ్యయనము, కాయిక, వాచిక, మానసికతపస్సు లాచర్చుట, సర్వదా న్యాయవర్తన గలిగి యితర ప్రాణుల హింసించకుండుట, సత్యవాక్కు, పరులు తనకపకారము జేసినను క్రోధము జెందకుండుట, అహంకార మమకార కామక్రోధాదుల విడచుట, చిత్తసమాధానము, యితరుల దోషముల ప్రకటనజేయకుండుట, ప్రాణులయందు దయ, మోహముకలిగించెడి వస్తువుల సమీపించినను వాటిని మోహించకుండుట, మృదుత్వము అనగా క్రౌర్యము లేకుండుట, చేయదగని పని పొరబడి చేసినను అట్టిదానికి సిగ్గుజెందుట, ప్రయోజనములేని వాటి కొరకు వాక్కు, చేతులు, పాదముల నుపయోగింపకుండుట, తేజస్సుగలిగి యుండుట, దేహేంద్రియాదులు ప్రోత్సహించుచున్నను అట్టివాటిని నిరసించి వాదించి నిగ్రహించు

అంతఃకరణ విశేషమైన ధైర్యము కలిగియుండుట, మృజ్జలాదులచే బాహ్యదేహశుద్ధి కామక్రోధాది కాలుష్య రాహిత్యమైన అంతఃకరణశుద్ధి గలిగియుండుట, పరులను బాధించకుండుట, తాను పూజ్యుడననియు, యితరులచే మర్యాద బొందువాడననియు గర్వములేకుండుట మొదలగు సద్గుణముల కలిగి పవిత్రజీవితముగలవారగుటచే దేవతలనియు, బ్రహ్మవేత్తలనియు, దైవాంశసంభూతులనియు, మానవోత్త ములనియు వినుతినందుటయేగాక వారి యేకైకప్రభావము నను ప్రకాశించి సహనపరులై మనోబలము, మేధాశక్తి, కవిత్వము, పాండిత్యము మొదలగు అనంతశక్తులు గలిగి ప్రజానాయకులై మతగురువులని సర్వజనులవల్లను సేవింప బడుటయేగాక గుణాతీతులై పరమేశ్వరుని యందైక్యతనొందు టయో, గాక కించతు గుణలోపము సంభవించిన పరమో త్కృష్టమైన పవిత్రజన్మల నెత్తుటయో సంభవించువారుగ నుందురు. వీరు ఉత్తమపతములకు జెందిన లోకపూజ్యులు. దైవబలసంపన్నులగుటచే వీరి కొకరి సహాయముగాని దేహ పోషణాదుల కితరుల నాశ్రయింపవలసిన దైన్యజీవనముగాని యుండదు.

## రజోగుణము.

ఉప్పు, పులుసు, కారము, చేదు, తీపి, వగరుగల పదా ర్థముల భక్షించుటచేతను అట్టివాటిని విస్తారముగ జేర్చి మిక్క

వించిన పదార్థముల నధికముగ భుజించుటవల్లను రాజస గుణము ఉద్భవించి రజోగుణముగలవారగుదురు. అట్టి రజోగుణలక్షణము లెవ్వియనగా:—అతికఠినులునుగాక పరమ సాత్వికులునగాక నిలుకడలేని మనస్సుకలవారై యొకప్పుడు సంసారవిరక్తి, మరొకతరి సంసారానురక్తి, ఒకప్పుడు లోకము నందనురక్తి, మరియొకచో లోకేశునియందు భక్తి, ఒకతరుణమునభక్తిపైదృష్టి, వేరొకతరి భుక్తికై పాకులాట, ఒకసారి భోగములపై విరక్తి, మరియొకచో భోగములకై వెదకులాట యీమొదలగు ద్వంద్వమనస్కులై నిశ్చయజ్ఞానము పొందజాలక దంభలోభక్రోధాసూయాది దుర్గుణంబులందవిలి యీ కోరికలిప్పుడు నాచేత పొందబడినవి. మరియు ఈకోరికల మున్ముందు పొందగలను. గోవులు భూమి బంగారము మొదలగు ధనము నాకుగలదు ఇంకా నాకు సంతోషము కలిగించు ద్రవ్యముల మున్ముందు సంపాదింపగలను, ఈశత్రువులు నాచేత జయింపబడిరి, మిగిలిన శత్రువులను మున్ముందు జయించగలను, నేను ప్రభుడను, నన్నితరు లేమియు జేయలేరు, నేను సమస్తభోగముల ననుభవించువాడను, నేను తలచిన పనులు నెరవేర్చుకొనగలను, నాకు సంతోషమునిచ్చు కొడుకులు, మనుమలు, మునిమనుమలుగలవాడను, బలవంతుడను, సుఖముగలవాడను, ధనవంతుడను మంచికులముగలవాడనై యున్నాను. అన్నివిధములచేతను నాతో సమానుడు లేడు.

నన్ను పొగడువారికి ద్రవ్యమిచ్చెదను. సంతోషించగలను. అని దలంచుచు ద్రవ్యాశచే హీనులసహితము నాశ్రయించి భోధింపబడిగాని ధర్మము లరయనేరక సంఘబలమునగాని కానొక్కరుండై యేపనియు నిర్వహింపజాలక స్వప్రయోజన మాసించు మూర్ఖజాతివారిచే మాత్రము తరచు సేవింపబడుచుందురు. దారాపుత్రగేహదేహాదుల యందు మమత్వము నంజేసి ఆశాపాశములచే గట్టుపడి సంసారచక్రమున గిరగిరం దిరుగుచు అనేకయోనులందు బుట్టుచు జచ్చుచు తుదకు నీచ జన్మల బొల్పడుచుందురు. వీరు మధ్యమతరగతికి జెందిన మానవులు. వీరికొకప్పుడు పూజింపబడుటయు తిరస్కరింపబడుటయు గూడ జరుగుచుండును. దైవబలము అల్పము. ధనాశచే యితరుల నాశ్రయించి జీవించుచుందురు.

## తమోగుణము.

మత్స్యమాంసాదులను, కల్లు మొదలగు మత్తుపదార్థములను, అపరిశుద్ధమై కంపుగొట్టు మలినపదార్థములను, చిరకాలము నిలువయుండి చూచుట కసహ్యమగు ఆహారాదులను వాడుటయును, మితము దప్పిదినుటచేతను తామసగుణము లభివృద్ధియై మనోవికారము గలిగించి యింద్రియాదులను రేకొట్టి విషయవాసనల గలిగించి వాటిని నెరవేర్చుకొన నాసజనించి ఓరిమి, శాంతము మొదలగు గుణములు నశించి క్రోధకాఠిన్యచిత్తులై మంచి చెడుగుల గ్రహింపజాలకుందురు. తామసగుణముచే బుద్ధి మోటు జెందిన కారణమున సోదర

సోదరీలను తల్లిదండ్రులను బాలాపుత్రులను గూడ హత్యలొనర్చుటకు వెనుదీయనంతటి అవివేకులై ప్రజాదండన రాజదండనలకు తరచు పాల్పడుటయే గాక ఉరిశిక్షలకుగూడ బాల్పడి దుఃఖించుచుందురు. జాలియనునది మచ్చునకైన కానరాక తరచు కయ్యములకు కాలుదువ్వి యితరుల జంపుటయో లేక దామేపడయుటయో సంభవించుచుండును.

జిహ్వాచాపల్యముచే దానవకృత్యము లొనర్చి యితర సాధుజంతువులను ఆహారముకొరకు నిర్దయతో వధింతురు. ఆహార పానీయాదులలోగాని దేహవస్త్రాదులలో గాని శుచిత్వ మెరుంగక శయన గృహము లందును భోజనశాలలందును ఉమియుట మొదలగు నీచపువనులం జేయుచుందురు. మాంసాది పదార్థములు సులభముగ జీర్ణముగాని గురుత్వ పదార్థములగుటచే పూర్తిగ జీర్ణింపక కుళ్లి ప్రేవులలో విష క్రిములబుట్టించి తరుచు అజీర్ణాదులవలన వాంతి, భేది, మశూచి కాది వ్యాధులచే బీడింపబడుచు అకాలమృత్యువాతం బడుచుందురు. కరుణాశూన్యులగు నిట్టివారు బిడ్డలను బెంచినట్లు జంతుకూనలను పెంచి వాటిని నమ్మించి తమయందు గాఢానురాగము గలిగి తమను ప్రేమించు నోరులేని దుష్టస్వభావ శూన్యములైన జంతువులను నఱికి దినుటయో లేక యొండొంటికి వైరముల గలిగించి పోరు కల్పించి ప్రాణాపాయముల గలిగించి విలాసానందములతో వీక్షించి యానందింపుచుందురేగాని జాలిభావము మచ్చునకైన బొందకుందురు.

దయాశూన్యులగు నిట్టివారు కరువుదినములలో నితరులను బొట్ట
కూటికిని కట్టువస్త్రములకును యాచించియు, పరుల ప్రేమను
ఆకర్షింపజాలక తిరస్కరింపబడుచుందురు. మరియు జీవబలులు
మొదలగు అకృత్యము లొనర్చుచు తామనుసరించినది ధర్మము
వని తలంచుచుందురు. ఐశ్వర్యము, విద్య, బంధుగులు మొద
లగునవి తమకు గలవనుగర్వంబును, తామే గొప్పవార మని
తలంచి మహాత్ముల తిరస్కరించు దురహంకారమును, యిత
రుల కపకారము జేయునట్టిస్వభావమునకు హేతువగు నేత్రా
ద్యవయవ వికారమే స్వభావముగాగల మనోవికారమగు
క్రోధంబును యితరులను జూచి కఠినముగ బల్కుటయును,
తాము సమస్తమైన గుణములతోడనుకూడియున్నట్లు భావించి
తమ్మును దామే గౌరవించుకొనువారుగను, పెద్దల యెడ
మర్యాద లేనివారుగను, మదము, అహంకారము, దర్పము
పరస్త్రీవ్యామోహము, అకాలములో స్వస్త్రీని గవయుట,
సన్మార్గములందుండెడి పెద్దలను జూచి యోర్వజాలక, దోషక
ల్పనల జేసి ప్రకటించువారుగను, దా మందరికంటె శ్రేష్ఠుల
మని ప్రకటనచేయుట యనెడి డంబము గలవారుగను, శాస్త్రో
క్తక్రియల విడచి వారిష్టమువచ్చినట్లు కోరికలతో అసురపూజ
లొనర్చు వారుగను, సత్పురుషులయందు ద్వేషము గలవారు
గను, క్రూరస్వభావము గలవారుగను, ఎంతశ్రమపడినను నింప
శక్యముగాని నాశ నవలంభించిదంభగర్వములతోగూడి మత్స్య

మాంసములు మొదలగు అశుచివస్తువులను భుజించుటయందే ఆసక్తిగలవారై అవివేకముచేత చెడుపట్టుదలగలవారై, కామోపభోగమే పరమపురుషార్థమని భావించి దురాశను కోపమును ముఖ్యాధారముగనాశ్రయించి విషయానుభవసంపూర్తి కొరకు అసత్య, లోభ, చౌర్య, దౌర్జన్య, మాయ, కలహ, కపట ద్యూత, పాన, ప్రాణిహింసాది కలుషకృత్యము లొనర్చుచున్, చేయదగినదిదియనియు చేయరానిదిదియనియు గ్రహింపజాలక బుద్ధిహీనులై స్త్రీపురుషసంయోగమాత్రమున సృష్టిజరుగుచుండుననియు కామోపశమనమే ముఖ్యపరమావధియనియు వేదశాస్త్రప్రమాణము లబద్ధమనియు దైవమే లేడనియు మొదలగు అసత్యప్రచారము లొనర్చి హింసాకృత్యము లజేయుచు జగత్తునకు శత్రువులై ప్రపంచనాశకులై గ్రుమ్మరుచుందురు.

ఇట్టివారిరూపములు భయంకరముగను అసహ్యముగను యుండును. మరియు వీరిబుద్ధి మోటుబారియుండుటచే సంగీతమాధుర్యము, వేదపురాణశాస్త్రముల నీతిబోధ కవీశ్వరుల కవితామాధుర్యము, పశుజంతువులయెడ కృప లేనివారుగ నుండుటయేగాక బోధింపబడియు గ్రహింపనేరనివారుగ నుందురు. ఇట్టివారికి సంఘబలమున్నను నెద్దానినిగూడ సాధింపజాలరు. వీరికి మృగాదులు మాత్రము సేవచేయుచుందురు. ఇట్టివారలు అసురభావము గలవారగుటచే దైవభక్తిశూన్యులై నీచయోనులందు పునశ్శ్వానసూకరసర్పవృశ్చికాది జన్మ

లనో, లేక పాషాణవృక్షాదిజడస్వరూపులుగనో బుట్టుదు రని భగవద్గీతాది పవిత్రగ్రంథములు నొక్కి చెప్పుచున్నవి. కావున యో సుజనులారా! పైమూడింటియందును ఏగుణముల నాశ్రయించిన బాగుండునో బాగుగా యోజించుకొనుడు.

వీర లధమతరగతికి జెందినదానవులనియు నీచమానవులనియు పిలువబడుదురు. వీరికి పూజితము శూన్యము. ఎంత ప్రయత్నించినను తిరస్కరింపబడుటయే వీరికి గత్యంతరము. దానవస్వరూపులగుటచే దైవబలము శూన్యము. కాయకష్టమున గాని శరీరపోషణ జరుగదు.

ముఖ్యగమనిక:—మిశ్రమాహారభుక్కులు మిశ్రమగుణములు గలిగియుందురు గతజన్మవాసనలు గూడ గ్రహింపవలసియుండును. అనగా గతజన్మయందు సజ్జనుడైయుండి యీజన్మమున నీచాహార మొనర్చువారియందు పూర్వజన్మవాసన ననుసరించి కొన్నిసద్గుణములు కనిపించుట కవకాశము కలదు. ఇట్లేయూహించుకొనవలయును. మొత్తముమీద ఆహారభేదములవలన సద్గుణదుర్గుణములు కల్గుట కవకాశము మెండుగా గలదు.

---

## క్రియమాంస భక్షణ ముచితమా ?

---

శ్లో॥ అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ
సంస్కర్తాచోప హర్తాచ ఖాదకశ్చేతి ఘాతుకాః॥

మనుస్మృతి అ 5. శ్లో 51.

తా. 1. ప్రాణులను వధించుటలో సంతోషముగలవాడును, 2. వధించుట కాజ్ఞాపించువాడును, 3. వధించువాడును, 4. అమ్మువాడును, 5. కొనువాడును 6. ఛేదించువాడును 7. వండువాడును, 8. తినువాడును యీఎనమండ్రును ఘాతుకులలో చేరినవారని మనువచనము.

పై శ్లోకార్థమునుబట్టి ఖరీదునిచ్చి మాంసమునుకొని భుజించుటచే హింసాపాపములేదని దలంచుట మిక్కిలి తప్పు అభిప్రాయమని స్పష్టపడుచున్నది. ధనము నొసగికొనెడివారులేనిచో గసాయివాడావృత్తినుండి తక్షణమే విరమించును. కావున కొనెడివారే హింసకు కారకులగుచున్నారు. చౌర్యవృత్తి యందు చోరులకు సహాయపడువారందరును రాజదండనార్హులైనట్లే విక్రయ మాంసభక్షకులుంగూడ హింసాపాపములకు భాగస్వాము లగుచున్నారు. క్రయమాంసభక్షణము కేవలము ధనమునిచ్చి విషము గొనుట వంటిది. కనుక విపరీతవాదముల జేయక మన దేశమున గల కసాయిదుకాణములనన్నిటిని రూపుమాయునట్లుజేసి వెంటనే శ్రీపరమేశ్వరచరణపద్మముల నర్చింప పూజార్హములగు సుగంధ పరిమళ కుసుమ విక్రయశాలలగునట్లుజేసి తరింపుదురుగాక. కసాయివృత్తిని నీచమని వచింతురు. అట్టి వృత్తిని ప్రోత్సహించు మాంసాహారు లెవరు? నీచులుగాదా? మాంసమును "నీచు" అని యందురు. అట్టి నీచును దినువా రెవరగుదురు? రక్తము, మాంసము, ఎముకలు మొద

లగునవియందు ప్రదేశములు అసహ్యముగ జూపట్టును. పూవులు, కాయలు, పండ్లు మొదలగునవి గల స్థలములు మనస్సునకు యింపుకలిగించును. కావున సుజనులారా! భూత దయ గలిగి మాంసవర్జితులుకండు! కట్టెలతో కాష్టముమర్చి శ్మశానమున దహించుటయో లేక భూమియందు గోయిదీసి పూడ్చించుటయో మొదలగు మరణాంతరక్రియలొనర్పవలసిన జంతు మృతకళేబర మాంసఖండములను బిడ్డలనుకని పెంచు దయాభావ మెఱుంగు మానవులయ్యు కుక్షులను స్మశాన భూములుగజేసి క్రూరత్వమనెడి కట్టెలతో జఠరాగ్నియనెడి చిచ్చును ముట్టించి దహింప జూచుట మానవకృత్యమా? దానవకృత్యమా? అహా! ఎంతయాశ్చర్యము!

---

## క్రూరజంతువులు వధార్హములా ?

---

శ్లో॥ నాకృత్వా ప్రాణినాం హింసాం మాంస ముత్పద్యతే
క్వచిత్ నచ ప్రాణివధస్స్వర్గ్య స్తస్మాన్మాంసం
వివర్జయేత్.

మను. అ 5. శ్లో 48.

తా. ప్రాణిహింస జేయక మాంసము లభించదు. ప్రాణి హింస స్వర్గప్రదముకాదు. కావున శాస్త్రవిధి లేని మాంస భక్షణము విడువ వలయును.

అహింసావిషయము చర్చించునప్పుడు ఘాతుకజంతువు లను చంపవగునా? లేదా? యను సందేహము పలువురికి

బొడగట్టును. బాగుగనాలోచించినయెడల దీనిని గ్రహించుట మిక్కిలి సులభమనియే చదువరు లూహింపగలరు. ఆత్మసంరక్షణార్థము తనను హింసింపవచ్చిన వరులే వధార్హులైయుండ ఘాతుకమృగములగూర్చి ఆలోచన ఎందులకు! సాధుజీవులకు హాని కలిగింపవచ్చెడి నెవ్వానినైనను వధింపవచ్చును. షోడశకళా ప్రపూర్ణుడైన శ్రీరామచంద్రుడు విభీషణునికి శరణిచ్చుటయు, దుర్జనుడైన రావణుని సంహారించుటయు నిదర్శనము గాదా! శిష్టుడైన ప్రహ్లాదుని గాపాడి దుష్టుడగు హిరణ్యాకశిపుని దునుముట ప్రబలాదర్శము గాజాలదా! నిత్య శివపూజా దురంధరుడగు రావణుని దునుముటకు వానియందలి క్రూరత్వమే కారణము. అట్లే విభీషణాదుల గాపాడుటకు వారియందలి సాధుత్వములు గమనించబడెను. అయితే దేశసంరక్షణ విషయములో నఖండ సామ్రాజ్యపరిపాలనభారము వహింపు రాజన్యులు ప్రజాసౌకర్యావసరమునకై అడవి మృగముల వేటాడుపద్ధతిని మాత్రము రాజాజ్ఞలేక యితరు లనుసరింపరాదు. ఏలనన ఒకానొక హత్యానేరమొనర్చువానిని రాజు విచారించి శిక్షింపవలయునుగాని, సామాన్యమానవులు వానిని బట్టి నరికివేయుట ధర్మమగునా? కావున వేటపద్ధతి సామాన్యులనుసరింప రాదనియు దుష్టజంతువులను నహితము అనవసర జోక్యముచే జంపగూడదనియు, తమకు హానికలిగింపవచ్చినప్పుడు హింసించినదోషము జెందరనియు, సాధుజీవుల నెన్నటికిని జంపరాదనియు, గ్రహించుదురుగాక!

# వివిధహింసలు

---

శ్లో. అహింసాపరమోధర్మః । స్వధర్మః ప్రాణినాం వధః॥

తా. అహింసకు మించినధర్మమును హింసకు మించిన పాపము మరియొకటిలేదు.

వ్యవసాయాదిపరిశ్రమలలో పశువులను కాలపరిమితి లేకుండ పనిచేయించుట, యీడ్వలేనిబరువులను లాగించిముల్లు కఱ్ఱలతో పొడచుట, కొరడాలతో గొట్టుట, కొంతకాలము రక్తమాంసశల్యముల ధారవోసి సేవచేసినపశువులకు జబ్బులు ముసలితనము వచ్చునప్పుడు విశ్వాసరహితులై కసాయివాండ్ర కమ్మివేయుట, కోళ్లు, పందులు మొదలగువాటిని తలక్రిందుగ వేలవైచి తీసుకుపోవుట, జంతువులను, పక్షులను బోనుల లోను, పంజరములలోను బెట్టి వాటిస్వేచ్ఛాభివృద్ధుల నరి కట్టుట, గుఱ్ఱములు మొదలగువాటిచే సర్కసులలో స్వార్థము కొఱకు కష్టతరమైన పనుల జేయించుట, ఆహారము, మతము దేవతలు వేడుకలు, వేటలు, శాస్త్రపరిశోధనలు, వైద్యము, చట్టములపేరున జంతువుల జంపుట, గుఱ్ఱములను బండ్లకు గట్టి మర్మస్థలములయందు రక్తములు కారునట్లు బాదుట, మోయలేని బరువుల మోయించుట, అమితముగా పరుగు లెత్తించుట, జంతువులకు వేళపట్టున నీరు, గడ్డి వగైరా ఆహా రముల వేయక బాధించుట, లేగలను పాలు గుడువనీయక ఆకలిచే జచ్చునట్లుజేయుట మొదలగునవన్నియు ఘోరహింసం

లనియు యమునలకు కారకులగువారెల్లరును రౌరవ, మహా రౌరవ, అంధతామిస్ర, కుంభీపాక, భీకర మహానరకము లను భవింతురని పురాణాదులు చెప్పుచున్నందున జనులారా! బహుజాగరూకులై ప్రవర్తింపవలయును.

## జంగమస్థావర భేదవివరణము.

ఉ. ప్రాసను రాతనుం గలదె మాంసము ప్రాణులమేనగాక
యమ్మేనులనొంచునప్డు తన మేనులసోకిన మాత్రనట్లగున్
దానితలంపగావలదె తానదిమానిన హింసలన్నియున్
మానవె యెంచునుత్తముడు మాంసము మానుదయార్ద్ర
చిత్తుడై (మహాభారతం)

తా. మాంసము ప్రాణుల దేహమునుండిగాక రాతినుండియు, చెట్లనుండియు పొందగలమా? మాంసముకొఱకు ప్రాణుల దేహములను నరకునప్పు డాకత్తివేటు తన దేహమునకు తగిలిన ఎట్లుండునో గ్రహింపరాదా! తానది మానినచో హింసలన్నియు తొలగును. దీనిని గ్రహించి యుత్తముడగు వాడు దయతో మాంసము వర్జించును.

జిహ్వాచాపల్యముచే మాంసమును తినవలెనని మనలోగొందరు దా చెడినకోతి వనమంతయు చెరచెనను సామ్యముగ వృక్షాదులుమాత్రము జంతుజాలములవలె జీవులుగావా?

వాటిని హింసించుటమాత్రము హింసగాదా ? యని వాదించు
చుందురు. సందేహము నివారించుకొనుటకై ప్రశ్నించినచో
సమంజసమేయగును. కాని తమకు మాంసమునందుగల అను
రాగము నభివృద్ధిపరచుకొనుటకు బ్రశ్నించి, జవాబీయదలచు
వారిని నోడింప నుద్దేశించినయెడల యిట్టివాదకుల ధర్మమా
యని దేశము, కులము, మతము, వ్యక్తిగతముగ దానును
తుదకు దన్ననుసరించువారునుగూడ భ్రష్టులగుదురు. ఏదైన
మానవునియూహకుగాని దృష్టిగోచరమునకుగాని దుర్లభమైన
వాటిని నిర్ధారణజేయుటకు వేదమాతయే ప్రామాణ్యము.
శాస్త్రములే యాధారము. యుక్తి, శాస్త్రము, అనుభవము
అను నీమూడింటి సారాంశమే ధర్మనిర్ణయంబని పెద్ద లంగీక
రింతురు. అట్లుజేయక యుక్తికిని, అనుభవమునకును, గౌరవ
మిచ్చినయెడల, కొందరుపాపాత్ములు వారి యుక్త్యనుభవము
లనుబట్టి అవయవనిర్మాణ సమానత్వమును జూపి భార్య
యందుజూపిన కామాదిమనోవికారరూపమైన ప్రేమ సోదరి
యందేల దలంపరాదని ప్రశ్నించిన జవాబేమిగలదు ? ఓయి
మూఢుడా! వేదశాస్త్రాంగీకారముగాదనిమాత్రము చెప్పవలసి
వచ్చునుగాని వేరుగత్యంతరము లేదు, తత్కాలమలిన సుఖా
సందమున కాశించి కామాంధులు బోధించెడి పరాంగనా
సంగమప్రబోధప్రాశస్త్య మంగీకార యోగ్యమా ? జగం
బంతయు నంధకారమయంబని బలుకు అంధాలాపముల విన
నేర్తుమా ? దానమువలన ధనము జెడునని లుబ్ధుండు జేయు

ప్రచారమంగీకరింతుమా? అమృతము దైవసృష్టియని ద్రావిన విధమున విషమును దినవేర్తుమా? యుక్తినిబట్టియు అనుభవ మును బట్టియు మనకు యోగ్యములని దోచినను వేదశాస్త్ర నిర్ణయముల జూచి బాగోగులు నిర్ణయింపవలసి యుండును.

జంతువులకును వృక్షములకును భేదము లేదని భావించు వారలను సవినయముగ నొక్క విషయముమాత్రము అడిగి తెలిసికొనవలసియున్నది. అదేమనగా పల్లివనితలు జచ్చినచేప దేహములను బుట్టలయందిడి నెత్తిపై బెట్టుకొని మన సమీప మునుండి బోవునప్పుడు యాజచ్చినచేప కళేబరములనుండి గుప్పుగుప్పున గొట్టుచుండెడి దుర్వాసనలను దన స్వదేహము నుండి పైకివచ్చిన చమటవాసన భరింపజాలని సున్నితమైన ముక్కురంధ్రముల గలిగినమానవుడయ్యో ఎట్లు భరించి తుద కు ప్రాణతుల్యమైన ధనమును గుమ్మరించి కొని రుచియని యారగింపుచుండిరో! జెప్పగలరా? లేక ముక్కురంధ్రములు ఘ్రాణశక్తిని గోల్పోయి మోటుజెందినవా? అట్లైన ఘ్రాణశక్తి తోబాటు బుద్ధిగూడ మోటుజెంది గ్రాహణశక్తిగూడ లోపించ లేదుగదా? అట్టివారిని మాత్రము తృప్తినొందింపగలనేర్పు గాని, భావగాని, కవిత్వముగాని, లిపిగాని, శాస్త్రముగాని లభించుట దుర్లభము. జాగ్రత్తగ విచారించి మానవబుద్ధిని దుర్వినియోగపరచకుండు రేని తారతమ్యములు గోచరించును. అచేతనములగు వృక్షములు, భూవికారములు, భూవికారము లకు యత్నాదులు కలుగనేరవు. భూవికారములు అచేతనము లునగువాటికి సుఖదుఃఖహేతుత్వము కలుగనేరదు. చెట్లలో జీవమున్నదికాని జడత్వముగలవి. అన్నమయ ప్రాణమయ

కోశములున్నను యూహింపగల మనస్సు విచారింపగలబుద్ధి వ్యామోహాము జెందు చిత్తము దన్ను అభిమానించు అహంకారము ఉన్నట్లు బొడగాంచము. కర్మేంద్రియజ్ఞానేంద్రియములు లేవు. ఇంద్రియశూన్యములగు వాటికి సుఖదుఃఖములుండజాలవు. జంతువుల కవన్నియు యుండుటవలన కదలుట, భార్యాభర్తల వ్యామోహము, పిల్లలయందు అనురాగము, యజమానుల ఆజ్ఞలనుగ్రహించు గ్రహణశక్తి మొదలగు మానవానుకరణములగులక్షణములుకలిగియున్నవి. జంతువులుభయము జెందుట మొదలగు లక్షణములకలిగి తమకు సంభవించు హానిని ముందుగనే గ్రహించునవనియును, చెట్ల కాజ్ఞానము లేదనియు మనోబుద్ధి చిత్తాహంకారములు బహుఅల్పస్థితి నొంది యుండుననియు, జంతువులయం దవి బాగుగ వృద్ధిబొందినవనియు జగధీశచంద్రబోసు (ప్రకృతిశాస్త్రతత్వవేత్త) గారభిప్రాయపడి పై ప్రశ్నను తీవ్రముగ ఖండించియున్నారు. ఒక రోగికి శస్త్రచికిత్సజేయునపుడు వైద్యుడాతనికి మత్తుమందు ప్రయోగించును. అందువలన నారోగి శస్త్రక్రియవలన బాధ నొందడు. అప్పుడాతనిలో ప్రాణము మాత్రముండి మనస్సు పనిచేయనట్లే వృక్షాదుల జీవశక్తియు తదనుగుణ్యము గలవని ఎంచవలసియున్నది.

రక్తమాంస శల్యములు కానరాని జడస్వరూపములకు ఛేదించిన బాధకలుగజాలదు. దేహములను పురస్కరించుకొని రోమములు, గోళ్లు మొదలగునవి పెరగునట్లును, కొన్ని జంతువులకు శిరములపై కొమ్ములు మొదలగునవి ఎదుగునట్లును

వృక్షాదులు భూమినాశ్రయించి పెరుగుచున్నవి. రోమములను, నఖములను, పశుశృంగములను ఖండించిన నొప్పికలుగనట్లే వృక్షాదులుగూడ నట్టివిధానావస్థగలవనియే భావింపనగును. చెట్లను ఖండించిన తిరిగి చిగుర్చును. జంతుమానవులట్లు బ్రతుకజాలరు. దుంపజాతులను చిన్నముక్కలుగ ఖండించినను మొలకెత్తును. జంతువులను ఖండించినచో జచ్చును.

జంతుమానవాదులు స్త్రీపురుషసంయోగజనిత శుక్రశోణితముల కలయికవలన బుట్టుచున్నారు. వృక్షాదులు ఎంత కాలమునుండి నిలువయున్న బీజమైనను దనంతనె మొలకెత్తును. భగవంతుడు దన అవతారప్రభావముల ప్రదర్శించుటలో జలచరములయందు మత్స్యకూర్మమై భూచరములలో వరాహమై నరజంతు అల్పవ్యత్యాస సూచితమగు నరసింహరూపుడై మానవాదులలో రామకృష్ణాద్యవతారముల మాత్రము దాల్చి పాషాణవృక్షాదులలో దన అవతారప్రభావముల ప్రదర్శింపకుండుటనుబట్టి వ్యత్యాస మూహింపవలసియున్నది. అనగా పాషాణవృక్షాదులు పవిత్రమైన దైవశక్తిని ప్రతిఫలింపజేయజాలని జడస్వరూపములై యున్నవి. ఏది ఎట్లున్నను జగముల సృష్టించిన ప్రభువు ఆ యాజీవుల కాయాయాహారములను, వేదప్రమాణములచేనిర్ణయించుటలోక్రూర జంతువులకు మాంసాహారమును సాధుజీవులకు శాకాహారములును ప్రకృతిసిద్ధమైనందున శాకముల నుపయోగించిన

యడల మానవులు కీడొందనేరరు. భగవదాజ్ఞ ననుసరించుట సుఖప్రదము. తద్వ్యతిరేకము దుఃఖసంభవము.

---

## అహింసోద్ధరణ పాత్రనిర్ణయము.

---

సుజనులారా! పరమేశ్వరభక్తులారా! మతము, సంఘము, పూర్వాచార మనుపేరున జరుగుచున్న హింసలు, మాంసాహారమద్యపానదురభ్యాసములు దేశమున మితిమీరుచున్నవి. ఈ అహింసాతత్వప్రచారమువలన ప్రపంచశాంతి నెలకొనగల దనుయాశతో ప్రచారమునకై పూనుకొను పవిత్రోద్దేశ్యమున కెల్లరును తోడ్పడుట ముఖ్యవిధియై యున్నది. మనలో కొందరికి కలిధర్మమో యనునట్లు ధర్మప్రచారము జేయవచ్చిన ప్రచారకులను హేళనజేయుటయు, యిట్టి యుద్యమములు కొనసాగునా? యనియు, మీరు సరియైన అహింసాతత్వమార్గమున కాయక వాచక మానసికహింసల వర్జించిరా? యనియు, స్వార్థత్యాగు లగుదురా? యనియు, డంబమునకై గౌరవముకొరకు ప్రచారము జేయు మీమాటలు ఆచరణయోగ్యములు గావనియు ప్రశ్నించి నిరుత్సాహపరచి ఉద్యమముల నభివృద్ధికి రానీయక అడ్డుతగులుచునారు. గొందరునాస్తికత్వముల లోకమున సాగనేరదు. పూర్వయుగములలో సత్కార్యములకు రాక్షసులు అడ్డుతగులుచువా రనెడి పురాణగాథలు

పెక్కులు గలవు. 'శ్రేయాంసి బహువిఘ్నాని' యను ఆర్య వచనము గూడ గలదు. 'సాధనమున పనులు సమకూరు ధర లోన' అను వేమననీతినిబట్టి ప్రయత్నించినచో ఉద్యమసాఫల్య మొందుననియు. వాచిక మానసికహింసల వర్జించినను వర్జింప కున్నను కాయికహింస మానినపిదపగాని తక్కుంగల హింసలు వర్జింపబడవనియు, ఒకానొకడు పరస్త్రీని జూచి మానసికముగ భ్రమించినను. కాయికముగ బలాత్కరింపనిచో యాస్త్రీకిగాని వానికి గాని నైహికముగ కీడు గలుగజాలదనియు, తలిదండ్రు లకు కూడుబెట్టక వాచికమానసికములలో దృప్తులుకావలెనని విలపించిన ప్రయోజనములేనట్లే బాహ్యహింసల మానగాని మానసికహింసలు నశించవనెడివాకాశ జనించుటయే గాక లోక ములో యిప్పుడాదరింపబడి యభివృద్ధినందుచున్న రహితుసం ఘములు గ్రామోద్యోగీయసంఘములు, ఉపాధ్యాయసంఘ ములు, రాజకీయసంఘములు, వర్తకసంఘములు, పత్రికాసం ఘములు, పశుపతిసంఘములు; నాట్యకళాసంఘములు సినీమా సంఘములు, కూలీ సంఘములు, జమీందారీసంఘములు బ్రాహ్మణ, బ్రాహ్మణేతర, క్షత్రియ, వైశ్య, కాపు కమ్మ రెడ్డి వెలమ, శెట్టిబలిజ, వ చనుసోదర మొదలగు స్వార్థపరులతో గూడినసంఘము లెన్నియో యభివృద్ధి గాంచుచుండ మత్స్య మాంసనీచభుక్తముల మానుడనియు జూదచౌర్యాది దుర్వ్య త్తుల వశలుడనియు భోదించుటకే మాత్రము స్వార్థత్యాగులు కావలయునా? యనియు యూహించువారికి దోచకమానదు.

ఇక డంబగౌరవముల గూర్చి విచారింతము. పైనంఘుములవారికి జరుగు మన్ననలు, మర్యాదలు, ఆహ్వానపత్రములు, ఊరేగింపు టుత్సవములు, కర్పూరహారతులు, సన్మానపత్రములు, మోటారుయానములు, ఫొటోకల్లోలములు, పూలదండల అడావిడులు, నృత్యగీతవాయిద్యఘోషములు, పత్రికాప్రచురణములు, మొదలగు ఐహికగౌరవానందార్భాటములు యీమద్యమాంస నిషేధప్రచారకులాశింపరని నమ్మవలసియున్నది. ఏమందురా? ఇది కులతత్వసమస్యగాదు; వైరముల పురికొల్పి ఒకపార్టీవారిచే టీపార్టీల గుడుచుటకు! ఇది ఎలెక్షన్ దురహంకారపిశాచముగాదు, ఆత్మస్తుతులొనర్చుకొని రాజాధిరాజుల నొడిలో గూర్చుండనుంకించుటకు జస్టిస్ వైఖరిగాదు. పెద్దయుద్యోగుల ప్రాపుగాంచి అధికారపదవులసంపాదించుటకు తేట-పాట-సీటుగోటులంజూపి సొంపువెంపురొయ్యారముల ప్రజానీకములమనంబులాకర్షించు నటనాకౌశలముగాదు. పత్రికాముఖముల నలంకరించుటకు యిది ధనసమస్యగాదు శకటాశ్వగజవాహనారూఢులై ఊరేగింపబడుటకు. ఆదిమధ్యాంతములు లేక తల్లిగాని, తండ్రిగాని, పోషకులుగాని, సహాయకులు గాని లేని ధనశూన్యమైన నిరాధారసమస్య. గౌరవమువిడచి గాలిలో గంతులు, త్రాగుమోతులతో తంతులు నీచభక్తులతో వాదము, జూదగాండ్రతో

వియ్యాము, కల్లుకోరులతో నెయ్యాము, కసాయివాండ్రతో కయ్యాము మొదలగు వింతవంతులతో కత్తిమీదసాముచల సమతనూంకించు యీ మద్యపానమాంసాహార దురభ్యాస నిరోధకులరా! స్వార్థపరత! లేదు! లేదు మువ్వూటికిని లేదు! మొరలిడితే నోరులేని మూగజీవులు, అవయవములులేని యీగల కాడికొబ్బరివృక్షములునా! వీరి నాశ్యానింది గౌరవించు నది! బాగుగ యోజింపుము! ధర్మమకుటంబై సకలధర్మసమన్వయమగు ఈపవిత్రోద్యమమునకు భూతదయాపరులగు ధనవంతులెల్లరును తగుసహాయమొనర్చి ఆలుబిడ్డలతో జన్మాంతర సంస్కార పుణ్యపరిపాకవేళమున గలిగిన భూతదయావేశముతో ప్రచారమొనర్చు పవిత్రప్రచారకులను పోషింపవలయు ననియే ధర్మనిర్ణయము! ధనముగలిగి దానము చేయనివారిని, బీదవై దేశదైవసేవలొనర్పనివారిని, పీకకు ఇనుపగుదియగట్టి సముద్రమధ్యమున దింపవలయుననియు అట్టివారు భూమికిభారమనియు శాస్త్రములు ఘోషింపుచున్నవి. ప్రజలాచరింపనిండు లేదా నిరాకరింపనిండు. ధర్మమెరింగినపిదప ప్రచారము సేయకుండుటమాత్రము సత్పురుషలక్షణముగాదు. ఈ పవిత్రోద్యమ తత్వరహస్యములతో గూడినపుస్తకములు, కరపత్రములు, పత్రికాప్రకటనలు యనెడి పుష్కలావర్త మేఘముల బరగించి దయారసవర్షము కురిపించినంతనె ధర్మజిజ్ఞాసపరులను దాతలనెడి కల్పవృక్షములు సద్గ్రాహి యోగోత్సాహానందముతో విజృంభించి

కవీశ్వరులనెడి పుష్పములవికసింపజేసి గాయకులనెడి ఫలములచే అహింసా పరమో ధర్మః యనుశృతివాక్యములచాటించి భూత దయామృత రసమును పానముచేయించెదరుగాక ! జైనాదేశములో నల్లమందు దురభ్యాసనిర్మూలనమునకు ఏ యోగిపూనుకున్నాడు ? దేశీయులారా ! రండు. ఈ యుద్యమమునకు తోడ్పడ ధనవంతులు, దరిద్రులు, స్వార్థపరులు, త్యాగులు, యోగులు, భోగులు, ఉత్తములు, నీచులు, కవులు, గాయకులు, వేయేల పకీరు మొదలు పాదుషావరకు గలవ్యక్తులెల్లరు వర్హులే యనివిదితమగుచున్నవి. కావున హింసాపిశాచమును రూపుమాపుటకు జాతి మత వివక్షతగాని, స్త్రీ పురుష భేదముగాని, బాలవృద్ధ తారతమ్యముగాని, గమనింపక యావన్మందియు అర్హులేయని స్పష్టపడుచున్నది.

## ఆత్మఘాతకు లెవ్వరు ?

మరికొందరు విచిత్రవాదకులు ఆత్మకు చావులేదనియు అందువలన జంతువులను జంపిన దోషము సంభవింపదనియు హింసాకృత్యములనుండి విరమింప నుద్దేశించు పవిత్రులను దిరిగి పురికొల్పుచున్నారు ఆహా! ఎంత వింతయైన నీతిబోధయో సజ్జనులు బాగుగ యోచింపుడు ! అట్లైన తన ఆలుబిడ్డలలో నెవరినైన ఆత్మకు జావులేదను నెపముపై యితరులు జం

నుంకించుచో అట్టివాని నంగీకరించి యూరకుందురా ? కావున వీరి నీతిబోధ వరులకాచరణయోగ్యముగాదని స్పష్టపడు చున్నది. అనేకజన్మలనుండి సంస్కరింపబడి దైవానుగ్రహమున భగవంతునిలో లీనమగుటకు సాధ్యమైన నిర్మలత నొందజాలు మానవజన్మమెత్తియు అజ్ఞాన తామసాంధకార బంధురమగు గూలద్రోసి చిత్తమాలిన్యము నొందించు మాంసాహార మధుపానము లంగీకరించి నిర్మలాత్మను మాలిన్యమొందించి అజ్ఞానావరణయందు గూలద్రోసి నీచజన్మ సంప్రాప్తము నొందనుంకించువారు ఆత్మఘాతకులని వేదాదులు జెప్పుచున్నవి. అనగా తమ్ముదాము జంపుకొనువారని యర్థము.

---

## హింసా పాపములు.

---

శ్లో॥ మాంసభక్షైః సురాపానై ర్మూర్ఖైశ్చాక్షరవర్జితైః
వశుభిః పురుషాకారై ర్భారాక్రాంతా స్తిమేదినీ॥

తా. మాంసభక్షకులు, మధుపానప్రియులు, మూర్ఖులు, విద్యావిహీనులు మొదలగు మనుజపశువులను భూదేవి మోయుటకు సహింపకున్నది. శ్లో॥ ప్రాణిహింస నరాణాంతు కల్పకోటిశతమ్మనే తత్రతైలకటాహేషు గాఢంబద్ధ్వాపద

ద్యాతుం. ప్రాణిహింసయొనర్చు క్రూరులను యమలోకములో తైలము బాగుగా గాదిన పెనమునందు రెండు పాదములను దృఢముగాగట్టి కల్పకోటిశతములవరకు యమదూతలు బాధింతురు అని జెప్పబడియుండుటచే జీవహింస సర్వజనవర్జనీయము. మరియు, "మాంసాశీ నిశాచరః" అనగా మాంసముదినువారు మనుష్యరూపములోనున్న రా క్ష సు ల ని నారాయణస్మృతి జెప్పుచున్నది. అదియునుంగాక మాం=నన్ను ఎవరు నములుదురో, సః=వారిని తిరిగి నములుదును అని మాంసపదమున కర్థము. ఇరుల ద్రవ్యము నపహరించియు దిరిగి యియ్యగలము. లేదా వారే దిరిగి సంపాదింపగలరు గాని దేహములనుండి శిరములవేరుజేసితిరుగ బ్రతికించగలమా? యట్టివృత్తిసమ్మతించి గొంతుకోయుటగాదా? గావునసహోదరమానవులారా నేటనే కర్ణకఠోరములగు హింసావృత్తినుండి విరమింపుడు. హింస మానినయెడల శాంతి కలవడును. శాంతమువలన వివేకము గలుగును. వివేకముచే నిత్యసత్యవస్తువునందాసక్తిపొడమును. దానివలన భ క్తియు, అందునంజేసి ము క్తియు లభించును. కావున మానవకోటిలోని జాతి మత పురుష వర్ణభేదములతో నిమిత్తములేక యావన్మందియు యీ యుద్యమాభివృద్ధికి బాటుపడుట కనీసధర్మమని గు ర్తించుదురుగాక! హిం=అనగా హింసకు, దూ=అనగా దూరముగ నుండువారు హిందువులని గ్రహించి మత మర్యాదను గాపాడుదురుగాక!

# తుదిపలుకు.

---

మానవసోదరులారా !

ఈయుద్యమమునుగూర్చి మీకు బోధించవచ్చిన వారిపై నెట్టికోపమును జెందరాదు. మీరు జాగ్రతగ పరిశీలించి జూచినచో మీకు సమస్త ఐశ్వర్యములను ధారవోసిన మీ బంధుమిత్రాదులకంటెను వీరు మీకు అధికపూజ్యులని నమ్మెదరు. మీధనము, ఆరోగ్యము, అన్నిటికిని మించిన బుద్ధిబలమును నశింపుజేయుచున్న నీచభుక్తముల మానుడని బోధించిన పుణ్యాత్ములు మీ కన్నివిధముల బూజ్యులే కదా ! బోధకుల యొక్క సుగుణసంపత్తిగాని, స్వార్థపరత్వములు గాని మీరు పరిశీలింపవలసిన అవసరము లేదు. ఏలనన రైలుబండ్లలో దొంగలున్నారుజాగ్రత యనియు, ఆస్పత్రులలో విషములు ముట్టరాదనియు, విద్యుత్ పవరు హౌసులవద్ద అపాయము తాక రాదనియు వ్రాయబడియుండు వ్రాతలు ఎట్టివారు వ్రాసినను అనుమానింపక ఎట్లు ప్రజలవలన అనుసరింపబడ వలసియున్నదో అట్లే యీ మద్యమాంసాహారముల విడువ వలెనని ఎట్టివారుబోధించినను విని యాచరించవలసినదే గాని ఉపేక్షించినచో అనేక కీడులు సంభవింప గలవు. ఇక కొందరు అభిమానవతియగు భార్యకు కోపము వచ్చుననియు, పుత్రాదులు బెంగటిల్లుదురనియు, బంధుగులు యాక్షేపింతురనియు మాంసము విడవజాల కుందురు. సర్వవిధముల

అరిష్టదాయకమైన మాంసమును గృహయజమాని ముందు విసర్జించి, పాఠశాలకు పోనొల్లక అల్లరచిల్లరగ తిరుగు బాలుని శ్రేయముగోరు తండ్రి మందలించునట్లే కుటుంబశ్రేయము గోరు యజమానులందరును యింటివారినెల్ల మందలించి మాన్పించవలయును గాని ఉపేక్షింపరాదు. అట్టివారింగాంచి బంధుగులు శ్లాఘింతురుగాని యాక్షేపింపజాలరు. ఒక దీపము వలన యనేకదీపములు వెలిగింపబడునట్లే ఒకరినుండి యొకరు నేర్చికొని మాంసభక్షణ మానుకొందురు. మాంసాహారము మానవులకు అన్నము మొదలగు వానివలె సహజాహారము గాదు. నంజుడుగమాత్ర ముపయోగపడుచున్నందున సులువుగ విసర్జింపవచ్చును. ఏదో ప్రాణావసానకాలమున ఆపద్ధర్మముగ పురాణములలో ఎవరో ఋషులు మాంసము నారగించిరని కొందరాడెడి పలుకుల విని మోసపోరాదు. చక్కని దేహమంతయు నిండగా ఈగలు రసికారెడి పుండుపై వ్రాలునట్లు పురాణములలో నేర్చికొనవలసిన నీతిబోధ లనేకములుండ నీచమాంసాహార సమర్థనమా! ఔరా కలిమాహాత్మ్యము! అయితే శ్రీరామునివలె మనలో నెవ్వరైనను భార్యను అగ్నియందు దూకింపగల సమర్థులు గలరా? వశిష్ఠునివలె దన నిష్కపటతపశ్చర్యావిశేషంబైన తేజః ప్రభావంబున మాతంగకన్యను నిమేషమాత్రమున సప్తజన్మంబు లెత్తించి దేహమాలిన్యమె గాక మనోమాలిన్యము కూడ బోనార్చి

చిత్తసంస్కారయోగ్యురాలగు నట్లొనర్చి పరిణయం బాడిన యాతని అనన్యసామాన్యతపః ప్రభావసంజనిత మహావిశేషం బున సృష్టిస్థితిలయంబులం బొందింపగలసమర్థత మనయందు గలదా నీచవనితోద్వాహసమస్య నంగీకరించుటకు? అట్లే ఆత్మజ్ఞానపరిపూర్ణులగు ఋష్యాదులు ఆపత్కాలమున కించుక మాంసభక్షణచేసిరేమోగాని మంచిదియగునెడల మరల దానిని పరిగ్రహింపకుండ నేలవదలిరి? యద్దాని నొకచో ఆపద్ధర్మముగ ననుసరించినను వెంటనే వారి సమాధియోగ బల ప్రభావంబునం జేసి దానిచెడుగుల మనోదేహంబుల కంట కుండునట్లొనర్చి అసురభావంబులం గాని, కామాదిమనో వికారంబులంగాని జెందక ప్రశాంతచిత్తులై బ్రహ్మభావం బున ప్రకాశించి జూపిన జితేంద్రియ ధీరత్వంబులు మనయం దెన్నడైన జూపట్టునా? ఆపైన ధర్మరాజుం జూచి జూదంబును, కుంతీదేవిని గాంచి ధర్మసంతానమును, దశరథునిగాంచి పుత్ర శోకంబున జచ్చుటయును మనము గ్రహించవలసినధర్మములు.

అది యట్లుండ పూర్వాచార మని మనలో కొందరు మాంసము విడువకున్నారు. ఎప్పుడైనను మంచి పనులకు పూర్వాచారము వర్తించును గాని మాంసభక్షణ, త్రాగుడు, జూదము, దొంగతనము, వ్యభిచారము, స్త్రీసంబంధమగు జాడ్యములు వీటికికూడ పూర్వాచారమేనా? ఆపనులన్నియు తాతతండ్రులు జేసిరని అవశ్యం పితురాచార మని భావించి

కుమారులు కూడ యిట్లేనడుపవలయు నని నెవ్వరైన ననగల్గు దురా ? భక్తశిఖామణి యను కీర్తిగాంచిన ప్రహ్లాదుడు సహితము న్యాయముకొఱకు తండ్రిని ధిక్కరించి రాక్షసకులాచార విరుద్ధమైన హరిస్మరణజేసి తరించలేదా ? తాతతండ్రులు దురహంకారులై కోర్టుల కెక్కి ధనమును బాడుజేసి ఉరిశిక్షల బొందిన మనుమలు గూడ వారి దారిని బట్టవలసినదేనా ? ఎంత విపరీతనిర్ణయమో పరిశీలించుడు. ఎవరు పాపపంకిలంబగు నీచమద్యమాంసముల తిందురో వారు జ్ఞానశూన్యులై శూద్రు లగుదురని వేదశాస్త్రములు జెప్పుచున్నవిగాని మేమెశూద్రుల మని భావించి మాంసము తినవలసిన దని చెప్పలేదు.

దొంగలుమాత్రము దొంగిలించిన నేరము గాదా ? అందువలన మద్యమాంసముల విసర్జించి అందరును బ్రహ్మ జ్ఞానసంపన్నులై మానవోత్తము లగుదురు గాక! ఇప్పుడు మన మారగింపుచున్న కాఫీ మొదలగు పానీయాదులు పూర్వాచారములా ? అట్లే ఏయడవిమనుష్యులతోనో చెలిమిజేసిన మోటుమానవులు యీ మద్యమాంసముల దేశమునందు ప్రాకించియుందురు. దానివలన మనకు కీడు గలుగుచున్నట్లు గ్రహించియుండియు పూర్వాచార మని అభిమానించుట మనలను మనము పాడుజేసికొనుటగాదా ? ప్రభుత్వకారాగారములయందు జూద, పాన, వ్యభిచార, చౌర్యాదివృత్తుల నొనర్చియు, హత్యలజేసియు ఎందరు మద్యమాంసాహారులు కఠిన

శిష్యులపాత్రై బాధలం గుండుచున్నారో గమనించుడు ! ఏహో నాలుగు పైసలు పిల్లలకు సంపాదించి పారవేసిన దాని ఫలి కలుకుచున్నారు. మీరు నేర్పియుంచిన ఆహారపానీయవ్యధా వములు వారి స్థితికి చాల్పడజేయునో లోకానుభవములవలన గుర్తించుడు. మీ తండ్రి తాతలు రోజునకు ముప్పది నలుబది మైళ్లు నడువగలసమర్థులై యుండెడివారు. మనమో యొక అరమైలు దూరము గూడ నడువలేని స్థితియం దున్నారము. అట్లే మీరును మీ పూర్వులును వివేకములచే యింద్రియా దులను స్వాధీనపరచుకొనగల్గిరేమోగాని యీనాటి మీబిడ్డలు కామక్రోధదాసులై ఎట్లు ప్రవర్తించి ఏమగుచున్నారో యోచించి చూడండి. మీరు ఆనందమనుకొని వారికి నేర్పియుంచిన ఆహారవ్యత్యాసములే వారి దుఃఖనాశనములకు కారణములు కాగలవు. కావున సాత్త్వికాహారముల నేర్పి వారిని వివేక వంతులుగ జేసి పుణ్యము గట్టుకొనుడు. మీధనముతో వారికి పనిలేదు. తెలివియుండిన సుఖముగ జీవింపగల్గుదురు.

ఎన్నివిధముల బరిశీలించిచూచినను కలరా మశూచి కాది నీచరోగములు మద్యమాంసాహారుల యిండ్లలోనే తర చు ప్రారంభమగుచున్నవి. అది యట్లుండ శాకములు చౌకగ లభించును. మాంసమత్స్యములు అధికమగు ధనమును గ్రుమ్మ రించినగాని లభించవు. అందుకొరకు ధనమును వెచ్చించి కుటుంబములకు ద్రోహమొనర్చుచున్నారలు మహిమభ్రముల

ఁరిశీలింతమన్నను యేయాహారమును మితిమీరి భక్షించుటచే పులులు మొదలగు వాటికి నోటియందు కులకులలాడు పురుగులు పుట్టుచున్నవో! అట్టిది తలచినమాత్రమున శరీరములు కంపరమొందునట్లు జేసి అసహ్యమొదవింప జేయునో! దేనిని భక్షించి నీగ్రోజాతివారు జ్ఞానశూన్యులై అనాగరికులని పరిగణింపబడుచున్నారలో యట్టిమాంసము నీచాహారమై యున్నది.

దృష్టికా అసహ్యము! ఆరోగ్యమా శూన్యము! గౌరవమా బహుహైన్యము. అట్టి ధన, శుచి, ఆరోగ్య, బుద్ధినాశనముల కాకరమైన మాంసాహారములవలన నేమియు ప్రయోజనము లేదని గ్రహించి తక్షణమే విడువవలయునని అందరును గ్రహింతురుగాక! మరికొందరు దూరాలోచనారహితులు మాంసాహారము పౌరుషమును కలిగించునని తలంచుచున్నారు. పౌరుషమనగా మతము, ధర్మము, సత్యము, దేశము, ఆత్మగౌరవము మొదలగువాటిని గాపాడుటకై వినియోగపరుపబడు శౌర్యమునకు పౌరుషమని పేరు. అంతియెగాని వ్యభిచారగృహములలో దెబ్బలాడుటయు, సజ్జనులతో వితండావాదములొనర్చుటయు, అమాయకుల బెదిరించుటయు, త్రప్పత్రాగి వీధులలో శునకములవలె కయ్యములాడుటయు, పౌరుషలక్షణములు గావు. అట్టివారిని ప్రజలో ప్రభుత్వమో ముక్కుత్రాళ్ళచే బంధించి అణగద్రొక్కుచునే యుందురు. కావున

యే దేశమున శిబిప్రముఖాది రాజన్యులు పక్షులకుగూడ దేహమును ధారవోసి తమ జీవకారుణ్యమును వెల్లడించి ప్రసిద్ధి నొందిరో! యే దేశమున ప్రహ్లాదాది భక్తవరులు సర్వజీవులను తమవలె భావించి యశముగాంచిరో! యే దేశమున పరమపావనమగు ఆమ్నాయములు మొదలు తంతనాలవరకుగల సారస్వతమంతయు భూతదయ పుణ్యజనకమని యు భూతపీడనము పాపహేతువనియు నొక్కరీతిగ భామ్యాకాశములు మారుమ్రోగునట్లు ధ్వనింపుచున్నవో! యే దేశమున హింసకు దూరముగానుండువారు గావున హిందూనామము సార్థకపడుచున్నదో! అట్టి పవిత్రాశయములను గుర్తించి మీరెల్లరును భూతదయాపరులై సంఘములలో కట్టుబాటుల నేర్పరచి అహింసాపరులై మద్యమాంసముల విసర్జించి ధర్మమార్గమున ప్రవర్తిల్లునట్లు భగవానుడనుగ్రహించుగాత.

యే దేశమున శిబిప్రముఖాది రాజన్యులు పక్షులకుగూడ దేహమును ధారవోసి తమ జీవకారుణ్యమును వెల్లడించి ప్రసిద్ధి నొందిరో! యే దేశమున ప్రహ్లాదాది భక్తవరులు సర్వజీవులను తమవలె భావించి యశముగాంచిరో! యే దేశమున పరమపావనమగు ఆమ్నాయములు మొదలు తంతనాలవదమువరకుగల సారస్వతమంతయు భూతదయ పుణ్యజనకమనియు భూతపీడనము పాపహేతువనియు నొక్కరీతిగ భూమ్యాకాశములు మారుమ్రోగునట్లు ధ్వనించుచున్నవో! యే దేశమున హింసకు దూరముగానుండువారు గావున హిందూనామము సార్థకపడుచున్నదో! అట్టి పవిత్రాశయములను గుర్తించి మీరెల్లరును భూతదయాపరులై సంఘములలో కట్టుబాటుల నేర్పరచి అహింసాపరులై మద్యమాంసముల విసర్జించి ధర్మమార్గమున ప్రవర్తిల్లునట్లు భగవాను డనుగ్రహించుగాత.

సర్వజగంబును దనవశంబొందించి వినోదింపుచుండునో యట్టి పరమపావనంబగు అహింసావ్రతము నాచరించువా రెల్లరకు ను గైవల్యవైకుంఠములు కరతలామలకములని శ్రుతిస్మృతీతి హాసపురాణములు ఘోషించుచున్నందున నట్లాచరించి తరిం చెదరుగాక !

కం. నీపాదకమలసేవయు,
నీపాదార్చకులతోడి నెయ్యమును; నితాం
తాపారభూతదయయును,
దాపసమందార నాకు దయసేయఁగదే॥ భాగ.

గద్యము.

శ్రీ సీతారామకరుణాసమాసాదితవాగ్వైభవుండును కరణ
కమ్మవేపారికులసంభవ కామమాంబావిశ్వామిత్రసగో,
త్రుండును జానకీబాయీరామేశ్వరసుపుత్రుం
డును సకలసుధీజనవిధేయుండును నగు
జిల్లెళ్ల వెంకటశివరాయునిచే రచింపం
బడిన ప్రేమపారిజాత మను
వచనకావ్యము సర్వంబును
సంపూర్ణము.

